## రామ్కో సూత్రం:

# పైకప్పు అనగానే ఏదయినా ఒకటే, అయితే...

రామ్కో పైకప్పు అలాకాదు అన్ని ఆస్బెస్టాస్ సిమెంటు రేకులు చూపులకు ఒక్కలాగే వుంటాయి అయితే ప్రసిద్ధ నిర్మాణ శిల్పులు, నిర్మాతలు రామ్కో ఆస్బెస్టాస్ సిమెంటు రేకులనే ఎన్నుకుంటున్నారు. అవి ప్రత్యేకంగా వుంటున్నవి ఎందుకంటే వీరంతా శక్తినీ, మన్నికనూ కలిగి.... అగ్నికి, అరుగుదలకు తట్టుకునే గుణంకల వాటినే అడుగుతున్నారు క్లుప్తంగా చెప్పాలంటే— వాతావరణ పరిస్థితులకు అతీతంగా, తక్కువ పోషణ ఖర్చుతో, శాశ్వత భద్రతకోసం వీరు చూస్తున్నారు రామ్కో ఇలాంటి వాటిని అన్నిటినీ ఇవ్వగలుగుతోంది. కఠిన ప్రమాణాలకు ప్రాధాన్యత నివ్వటం, అధునాతన యంత్రాలతో తయారు కావటం రామ్కో ఉత్తమ పనితనాన్ని ధృవ పరుస్తున్నాయి పైకప్పు ఏదయినా ఒక్కటే అయితే ప్రసిద్ధ నిర్మాణ శిల్పులకు నిర్మాతలకు అలాంటిది కానిదేదో తెలుసు రామ్కో!



**సదరన్ ఆస్బెస్టాస్ సిమెంట్ లిమిటెడ్**




739, అణ్ణాసాలై మద్రాసు-600 002

ఆఫీసులు బెంగళూరు ● విజయవాడ ● హైదరాబాదు ● కొచ్చిన్ ● పూని

ఫ్యాక్టరీలు అరక్కోణం (తమిళనాడు) కరూరు (కర్ణాటక).

ACIL SAC 12 ATE 79

**Ramco**

**ఆస్బెస్టాస్ సిమెంటు రేకులు మరియు తదితరములు**

## లోకంపోకడ ★ ఉమేన్











# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం : 17-8-'79
సిద్ధార్థి నామ సం. శ్రావణ బ. దశమి
**సంపుటము 72 : సంచిక 49**

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయసూచిక


...మీద బొమ్మ :
'...'లో ఎస్. వి. రామా...

**కథలు :**

| | |
|---|---|
| కథ అడ్డం తిరిగింది | ... 11 |
| ముష్టి చెట్టు | ... 34 |
| శిక్ష | ... 41 |
| స్పెషల్ లేడి | ... 46 |

**సీరియల్ కథలు :**

| | |
|---|---|
| రాగరేఖలు | ... 6 |
| నళిని | ... 16 |

**వ్యాసాలు, శీర్షికలు :**

లోకంపోకడ-4, సామాన్యుని సణుగుడు-5, ధర్మపథం-10, బొమ్మల మహాభారతం-22, సినిమా-24, "డామ్" రైలుమార్గం-33, సామెతల కథలు-37, ప్రశ్నావళి-40, హైదరాబాద్ నోట్‌బుక్-45, పాలాక్షుని డైరీ-49, వారఫలం, ఉత్తరాలు-50



**కేంద్రంలో మిశ్రమ ప్రభుత్వం**

భారతదేశపు ఐదవ ప్రధానిగా జులై 28వ రాష్ట్రపతిభవన్‌లో ప్రమాణం చేస్తున్న శ్రీ చరణ్ సింగ్

## సామాన్యుని సణుగుడు

# పార్టీ ఫిరాయింపుదార్ల స్వేచ్ఛ !

**28** మాసాలుగా వున్న జనతా ప్రభుత్వం విచిత్రమైన పరిస్థితులలో పోయి, జనతా (యస్) కాంగ్రెస్ (యస్)ల "మిశ్రమ ప్రభుత్వం" తిల తండుల న్యాయంగా కేంద్రంలో సాంకేతిక ప్రాతిపదిక మీద గద్దె నలంకరించడంతో దేశాన్ని ప్రేక్షక మాత్రంగా చేసి- అయోమయ స్థితిలో పెట్టిన రాజకీయ సంక్షోభం — పార్టీల మార్పిడి సంరంభం— తాత్కాలికంగా సద్దుమణిగయి-తన జీవితాశయంగా, ఏకోన్ముఖ తీవ్రతర రాజకీయ వ్యూహరచన నైపుణ్యతనంతా ప్రదర్శించి నెగ్గిన శ్రీ చరణ్ సింగ్— రాష్ట్రపతి భవన్‌లో ప్రమాణ స్వీకారం చేయడంతో మొట్టమొదటి సారి కేంద్రంలో ప్రతిపక్షంకన్నా తక్కువ సంఖ్యా బలం గల ఒక "పాత నాయకుల సరికొత్త పార్టీ" అధికారంలోకి వచ్చింది.

### 6 వ ప్రధాని....?

మూడు దశాబ్దాలుగా మంత్రిగానే వుంటూ వున్న- మరో ప్రధాన మంత్రి పదవీ వ్యామోహ పరుడైన రాజకీయ దురంధరుడు శ్రీ జగ్జీవనరావ్ యిప్పుడు తొలిసారి ప్రతిపక్ష నాయకుడైనాడు — ఆయన చరణ్ సింగ్ గవర్నమెంట్‌ను "ఆపద్ధర్మ" ప్రభుత్వంగానే గుర్తిస్తున్నాడు— అసలు ప్రభుత్వం ఏర్పాటు చేస్తానంటున్నాడు. రాష్ట్రపతి ఆగస్టు మూడోవారంలోగా "చరణ్‌సింగ్ చవాన్"ల మిశ్రమ ప్రభుత్వాన్ని లోక్‌సభ విశ్వాసాన్ని పొందవలసిందని ఆదేశించారు. కాని యీ లోగనే లోక్‌సభ సమావేశం కావాలని యిప్పుడు మొరార్జీగారు పూర్తిగా అస్త్ర సన్యాసం చేయడంతో ఏకైక ప్రత్యర్థిగా- నిలిచిన— మాజీ రక్షణ మంత్రి 'డిమాండ్' చేస్తున్నారు— అంచేత మరో డ్రామాకి తెర లేవనున్న తరుణమే యిదన్నమాట!

ఇదంతా యీ విధంగా జరగటానికి, జనతా వైఫల్యం, కాంగ్రెసు చాక చక్యం, "చరణ్ రాజ్‌నారాయణ్‌ల" శక్తి సంపద యివన్నీ అలా వుంచి- ఆలోచిస్తే అసలైన వేరొక కారణ మున్నది! అదే ఎం. పీ.ల "పార్టీల మార్పిడి"—

ఈ పార్టీల మార్పిడికి అసలు యెటువంటి నియమం నియతీ లేవు- ఆఖరికి కొత్త పార్టీగా ఒక గ్రూపు పార్లమెంటులో గుర్తింపు పొందటాని క్కూడా అసలు కాల వ్యవధి నియమం కూడా లేదు—

వోట్లకోసం ప్రజల ముందుకు వెళ్ళేటప్పుడు- వో ప్రణాళికతో, వో పార్టీ సిద్ధాంతపు జెండాతో వెళ్ళి నిలబడి ఆపార్టీ కార్యక్రమాల కోసం వారి ఆమోద ముద్ర వేయించుకున్న వ్యక్తి- అసెంబ్లీలోనో పార్లమెంటులోనో ప్రవేశిస్తూనే పార్టీ ఫిరాయిస్తున్నాడు- ఈ విధంగా ఫిరాయించడానికి ప్రజల సమ్మతి అక్కరలేదు— సభాపతి ఆమోదం అక్కరలేదు— రుసుము—వ్రతం— లెక్కా జమా యివేమీ అవసరం లేదు- ఇలా చేయడం "వల కాదన్న" సామాన్యుని గోడు వినే నాధుడు లేడు. ఏ నియంతృత్వ శక్తులైతే దేశాన్ని ప్రజాస్వామ్య మార్గం నుంచి దారి మళ్ళిస్తున్నాయా, అంటూ వీరంతా ఏకమైనారో- అలా ఏకం కాగా- ఆ భయంతోనే— ప్రజలు చిత్తుగా ఆ 'శక్తుల్ని' వోడించారో అదంతా యివాళ అంతా మర్చిపోయారు. కాంగ్రెసు నుంచి చీలిపోయిన రెండు వర్గాల మద్దతుతోనే యివాళ ప్రభుత్వంయేర్పాటుకు అవకాశంయేర్పడ్డది.

### పాత కథ

జనతా గవర్నమెంటు అధికారంలోకి వస్తూనే పార్టీల మార్పిడి నిరోధానికి ఒక "బిల్లు" ఒక "పద్ధతి"— లేదా, యేదో ఒక నియమం యేర్పాటు చేస్తానంటూ— జె. పి. నుంచి సాధారణ యం. పీ. దాకా అందరూ హామీ యిచ్చి సమ్మతించారు— కాని అప్పుడు ప్రవాహం జోరు కాంగ్రెస్ నుంచి జనతాలోకి వుంది— కనుక యిటువంటి ప్రయత్నం ఏమీ కొనసాగలేదు—

నిజంగా కోర్టులో గెల్చినా గెల్వకపోయినా రాయ్‌బెరెల్లీలో "శ్రీ రాజ్‌నారాయణ్"

(48 వ పేజీ చూడండి)



# రాగరేఖలు

## సీరియల్

మాదవపెద్ది పుణ్యశీలాప్రసాద్



రైలు కదలబోతోంది. అంతలో ఒక ముసలాయన పెట్టెలోకి ఎక్కబోతూ, ఎక్కలేక అవస్థ పడడం చూసాడు అరుణ్! వెంటనే ఆయనకి చేయూత నిచ్చి పెట్టెలోకి ఎక్కించాడు. ఆ వెనకే ఒక నలభై ఏళ్ళ స్త్రీ కూడా ఎక్కింది! ఆమె కృతజ్ఞతా పూర్వకంగా అరుణ్ వైపు చూస్తూ ముసలాయన్ని సీటు మీద కూర్చోబెట్టింది.

సామాను సర్దుకుని తనూ కూచుంది. రైలు కదిలింది.

"రైట్ అరుణ్! పెళ్ళిలో కలుద్దాం! మీ శిల్పని అడిగానని చెప్పు. కృష్ణగారికి నమస్కారములని చెప్పు." ఇంగ్లీషులో అంటున్నాడు అనిరుధ్.

రైలు వేగం అందుకుంది! చెయ్యూపాడు అనిరుధ్!

సీటులో కూచుని వున్న ఆ స్త్రీ పరధ్యానంగా కిటికీ వైపు చూస్తోంది అనిరుధ్ మాటల్లో కొన్ని ఆవిడ చెవిలో పడ్డట్టున్నాయి. మొహంలో రంగులు మారాయి

*(గత సంచిక తరువాయి)*

ఒక్క క్షణమే అది. మళ్ళీ మామూలు స్థితి కొచ్చేసింది!

ఆ ముసలాయనకు కళ్ళు సరిగా కనబడనట్టున్నాయి. అన్నిటికీ తడుముకుంటున్నాడు.

బహుశా ఆయన ఆమె తండ్రేమో!

ఆమె వంక పరిశీలనగా చూశాడు అరుణ్. ముఖం మీద బొట్టు లేదు. జుట్టు అక్కడక్కడా నెరిసింది.

ఎన్నో బాధలు పడీ పడీ, ఎండిపోయి, కాంతి విహీనంగా వున్నట్టున్నాయి ఆమె కళ్ళు. మనిషి కూడా ఒకప్పుడు చాలా అందంగా వుండి వుండేదేమోనని పిస్తోంది. ఆ సౌందర్యఛాయలు ఇంకా పూర్తిగా పోలేదు.

అతడు ఆమెనట్లా చూస్తుంటే— శుష్కించి పోయిన పెదవులతో జీవంలేని నవ్వు నవ్వుతూ,

"ఏమిటి బాబూ చూస్తున్నావు?" అంది, తెలుగులో!

చటుక్కున చూపు మరల్చుకున్నాడు అరుణ్. ఆమె అంటే ఎందుకో జాలి కలిగింది అరుణ్‌కి!

"ఏం... ఏం... లేదండీ... ఎక్కడో మిమ్మల్ని చూసినట్లు వుంటేను! వారు... మీ నాన్నగారా?" తడబడుతూ తెలుగులోనే అన్నాడు ఏదో అనాలని!

"అవును" అంది.

"హైద్రాబాద్ వెళ్తున్నారా?" అనడిగాడు మళ్ళీ.

"అవును" అంది.

ఇంకేం మాట్లాడాలో తోచలేదు. మౌనంగా వుండి పోయాడు. సీటు వెనక్కి చేరబడి కూర్చుని ఆలోచనలో పడ్డాడు అరుణ్. కృష్ణ ఎందుకు రమ్మని వుంటాడు? బహుశా ఇంక పెళ్ళి ముహూర్తం సంగతి చర్చించడానికేమో? అయితే ఉత్తరమే రాసి వుండచ్చే, టెలిగ్రాం ఎందుకు? శిల్పతో తన కలయిక ఎప్పుడెప్పుడా అనిపిస్తోంది! అనిపిస్తున్న కొద్దీ అది దూరమౌతున్నట్లుంది!

'శిల్ప' పేరు వుచ్చరిస్తేనే తనువు పులకరిస్తోంది! శిల్పని చూస్తాననే ఉత్సాహం ఎక్కువయింది అరుణ్‌లో!

తను పెళ్ళయ్యాక కూడా శిల్పని కృష్ణ దగ్గిరే ఉండనివ్వాలి! తమదగ్గిరే వుంచుకోవడమో లేక తామే అతడి దగ్గిర వుండడమో చెయ్యాలి. నిజంగా కృష్ణ శిల్ప కోసం తన జీవితాన్నే ధారపోశాడు! అటువంటి మహనీయుడికి సేవ చెయ్యడం కంటే

***జరిగినకథ 12*** శిల్పకి బెంగుళూరు లోని కెనరా బాంక్‌లో ఉద్యోగం రాగా, కృష్ణ అక్కడ చేర్పించటానికి వెళ్తుంటే రైలు కోసం పరుగెడుతున్న చిత్రను చూచి అతని మనస్సు గతంలోకి పరుగెడు తుంది. తల్లి ప్రసవ వేదనతో మరణించగా, తన తండ్రి అయిన వెంకట్రావ్‌ను చిత్ర ద్వేషించటం కృష్ణకు చిత్రంగా తోస్తుంది. అవివాహితుడైన తనతో శిల్ప ఉంటున్న కారణంగా ఆమెకు వివాహం జరగదేమోనని బాధపడ్తాడు కృష్ణ. అరుణ్‌తో అర్చనకి పెళ్ళి నిశ్చయమయిందని శిల్పకి చెప్తుంది వైదేహి. అర్చనని పెళ్ళి చేసుకోవటం అరుణ్‌కి గాని, అరుణ్‌ని పెళ్ళి చేసుకోవటం అర్చనకి కాని యిష్టముండదు. అరుణ్, శిల్ప ఒకరి నొకరు ప్రేమించుకుంటారు. చిత్రని పెళ్ళి చేసుకుంటానని ఆమె తండ్రి వెంకట్రావ్‌తో కృష్ణ చెప్పగా, ముహూర్తం పెట్టిస్తాడు. శిల్ప పూర్వ వృత్తాంతం గురించి అరుణ్‌తో చెపుతూ వుంటాడు కృష్ణ. తను ప్రయాణించే రైలులో దొరికిన పాపను తీసుకొని తన ఇంటికి చేరుకుంటాడు కృష్ణ. ఆ పాప మూలముగా కృష్ణ, చిత్రల మధ్య మనస్పర్ధలు చెలరేగుతాయి. కొన్నాళ్ళకు చిత్ర మరొకరిని పెళ్ళి చేసుకొంటుంది. శిల్ప పెళ్ళి అరుణ్‌తో నిశ్చయమవుతుంది. ఆ పెళ్ళి పనుల తొందరలో కృష్ణకి 'యాక్సిడెంట్' జరుగుతుంది. ఆ యాక్సిడెంట్‌లో కృష్ణకి ఒక కాలూ, చెయ్యీ పోగా, శిల్ప పెళ్ళి వాయిదా పడుతుంది. అర్చన పెళ్ళి అనిరుధ్‌తో జరిగిపోతుంది.

ఇంకేం కావాలి ? ఇటా సాగుతున్నాయి అతడి ఆలోచనలు అంతలో ఏదో స్టేషన్‌లో రైలాగింది. ఆమె చేతిలో మరచెంబుతో హడావిడిగా రైలు దిగుతోంది! అరుణ్ అది చూచి, తను ఆమె చేతిలోని చెంబు అందుకుంటూ,

"అమ్మా మీరు నాన్నగారి దగ్గిరుండండి. నేను తీసుకు వస్తాను మంచి నీళ్ళు. ఇంకేమైనా కావాలా మీకు ?" అడిగాడు.

"చాలా థాక్సండీ ... ఏమీ అక్కరలేదు మంచినీళ్ళు చాలు. చాలా దాహంగా వుంది" అంది. ఆమె గొంతు తడారి పోయినట్టు వుంది! చెంబు నిండా నీళ్ళు పట్టుకుని గబగబా వచ్చి ఎక్కాడు పెట్టెలోకి!

అతడు అడుగు పెట్టగానే రైలు కదిలింది. చెంబు అందుకుంటూ మరోసారి కృతజ్ఞతలు చెప్పుకుందామె నీళ్ళు గ్లాసులోకి పోసుకుని, వెంటవెంటనే మూడు గ్లాసుల నీళ్ళు తాగింది!

"నాన్నా మీకు మంచినీళ్ళు కావాలా?" అనడిగింది ముసలాయాన్ని.

"కావాలమ్మా..." అన్నాడాయన. ఇచ్చిందామె. తాగి తిరిగి గ్లాసందిస్తూ,

"అమ్మా నీళ్ళు నువ్వు తెచ్చావా రైలు దిగి? కదులుతున్న రైల్లోకి ఎక్కడంగానీ, రైల్లోంచి దిగడంగానీ చెయ్యద్దు తల్లీ... ఈ ముసలి వయసులో నేనింకేదీ తట్టుకోలేను తల్లీ" అన్నాడాయన. ఆయన కళ్ళలోంచి నీళ్ళు జలజలా రాలాయి!

తండ్రి పక్కనే కూచుంటూ "లేదు నాన్నా, నేను దిగలేదు. ఇందాక మిమ్మల్ని రైల్లోకి ఎక్కించిన అబ్బాయి తెచ్చిచ్చాడు" అందామె.

"చాలా మంచి వాడులాగా వున్నాడు. పాపం" అన్నాడాయన సమాధానంగా.

కాసేపటికి ఆయన అరుణ్‌ని మాటల్లోకి దించాడు.

"నువ్వూ హైద్రాబాదేనా బాబూ వెళ్ళేది?"

"అవునండీ..."

"ఏ ఉద్యోగ అక్కడా.?"

"అవునండీ... ఇప్పుడే బొంబాయినించీ ట్రాన్స్‌ఫరైంది... ఇక్కడికి!"

"అయితే హైద్రాబాద్‌లో మీ వాళ్ళెవరన్నా ఉన్నారా. అంతా కొత్తా ?"

ఏమని చెప్పాలా అని ఒక్కక్షణం ఆలోచించాడు అరుణ్.

"ఆఁ ఉన్నారండీ!" అన్నాడు ఆయన వదలడని.

"ఎవరు ? మీ అత్తవారున్నారా ?"

నవ్వొచ్చింది ఆయన ప్రశ్నకి.

"నాకింకా పెళ్ళి కాలేదండీ!"

"అయితే మీ అమ్మా నాన్నా ఉన్నారా?"

తండ్రివేసే ప్రశ్నలకి ఆమె క్షమించమన్నట్టు చూసింది.

ఇంక చెప్పక తప్పేటట్టు లేదు — అనుకున్నాడు అరుణ్.

"నాకు పెళ్ళి సెటిల్ అయిందండీ ... వాళ్ళున్నారు అక్కడ!" అన్నాడు.

అట్లా అంటుంటే తన గొంతు తనకే కొత్తగా మధురంగా అనిపించింది.



"నాకు అమ్మా — నాన్నా చిన్నప్పుడే పోయారండీ!" తెలుగులో మాట్లాడడానికి కాస్త తడుముకోవాల్సి వస్తోంది అరుణ్‌కి. ఎందుకో మరి... బహుశా ఆయన ప్రశ్నలకేమో.

"అయ్యో పాపం" అన్నాడాయన జాలి పడుతూ.

"మరి ఎవరన్నా స్నేహితులున్నారా అక్కడ"

"ఆఁ అట్లా చెప్పు!" అని కొంచెం సేపాగి,

"ఎక్కడ బాబూ వాళ్ళుండేది ? మాది హైద్రాబాదేలే, అందుకే అడుగుతున్నాను." అడిగాడాయన మళ్ళీ.

"హిమయత్ నగర్‌లో..."

"హిమయత్ నగర్‌లో ఎక్కడ?" చెప్పాడు అరుణ్.

"అసలు వాళ్ళది ఏవూరు ?"

"ఏమోనండీ. వాళ్ళు చాలా కాలం నుంచీ హైదరాబాద్‌లోనే వున్నారు."

"ఆయన... అదే... ఆ పిల్ల తండ్రి ఏం చేస్తూ వుంటాడు ?"

"ఆ అమ్మాయికి తండ్రి లేడండీ... పినతండ్రి దగ్గర వుంటోంది. ఆయన కాలేజీలో లెక్చరర్‌గా వుంటున్నారు."

కృష్ణని తలుచుకోగానే అరుణ్ కళ్ళు చెమర్చాయి!

"ఆయన పేరు బాబూ ?"

"మురళీకృష్ణగారండీ."

"ఏ కాలేజీలో పనిచేస్తున్నారన్నావు ?" చెప్పాడు.

మొహం చిట్లించాడాయన. కనుబొమలు ముడుచుకున్నాయి. సాలోచనగా చూశాడు.

"ఆయన పెళ్ళి చేసుకోలేదు కదూ? పి. మురళీకృష్ణ ?..."

"అవునండీ... మీ కాయన తెలుసా ?"

అరుణ్ మాటలు వినిపించుకోకుండా—

"ఆ పిల్ల ఆయనకి దొరికిన పిల్ల కదూ ?" నిశితంగా చూస్తూ అడిగాడాయనే మళ్ళీ.

"అవును. కృష్ణగారు మీకు తెలుసా?"

ఆయన ముఖంలో విషాద ఛాయలు అలుముకున్నాయి! ఆయన కూతురి ముఖం కళావిహీనమై వుంది! అయిదు-పది నిమిషాలు ఏమీ మాట్లాడలేక పోయాడాయన.

తరువాత నెమ్మదిగా అన్నాడు, "తెలీడమేమిటి బాబూ, అతడు మేము జారవిడుచుకున్న రత్నం..." తనలో తను అనుకున్నట్లుగా అన్న ఈ మాటలు వింటుంటే అరుణ్‌కి ఆశ్చర్యంగా వుంది!

—"అయితే... ఆ పిల్లకి పెళ్ళి కూడా చేస్తున్నాడన్న మాట కృష్ణ? వింత ధర్ముడు!" అన్నాడు మళ్ళీ!

అరుణ్ ఆయన్నీ, ఆయన కూతుర్నీ మార్చి మార్చి చూస్తూ వుండిపోయాడు.

ఆమె పెదవులు వణుకుతున్నాయి! వచ్చే ఏడుపుని ఆపుకుంటోందామె!

"నువ్వు ఆ అమ్మాయిని గురించి అంతా తెలిసే చేసుకుంటున్నావన్న మాట! వింత మంచివాడవోయ్. చిన్నవాడివి, నీకున్నపాటి ఈ జ్ఞానం మా కానాడు లేకపోయింది! ఇప్పుడనుకుని ఏం లాభం..."

"నాన్నా.." వారింపుగా అందామె.

పెద్దగా మాట్లాడడానికి వీల్లేకుండా

## రా. గ. రేఖలు

ఆమె గొంతు జీరబోయింది!

కన్నీళ్ళు బుగ్గలపై జారాయి!

ఏం ప్రశ్నించలేదు-అరుణ్. చూస్తుండిపోయాడు మౌనంగా.

"చెప్పనీ- అమ్మా- ఇన్నాళ్ళనించీ నా గుండెల్లో మండుతున్న ఈ బడబానలాన్ని చల్లార్చుకోనీ... చేతులెప్పుడో కాలిపోయాయి... ఆకులైనా ఇప్పుడన్నా పట్టుకోనీ...! దానివల్ల ప్రయోజనం లేదు... కానీ, కానీ, కాస్త గుండె బరువన్నా తీర్చుకుందాం తల్లీ..."

"జీవితమంతా గడిచిపోయాక- చివరి రోజుల్లో మనం వెనక్కి తిరిగి చూసుకుంటే, మనకు మిగిలేది...మనం ఎప్పుడన్నా చేసిన మంచి పని అంటూ వుంటే అదే...



ఆదొక్కటే మనకు మనశ్శాంతి నిచ్చేది. మనం ఏం చేశాం? మనం మంచి పని చెయ్యక పోగా...ఆ మంచి పని చేస్తున్న వాడికి కనీసం చేయూతనన్నా ఇవ్వలేక పోయాం... అది, మన దురదృష్టం. కేవలం దురదృష్టమే... దాని ఫలితంగా మనమేం అనుభవిస్తాం? దుఃఖమేగా? ఈ చివరి దశలో నాకు నీ గురించి చింత మాత్రం మిగిలింది...నా తరవాత నీ సంగతేమిటన్న అశాంతి మాత్రం మిగిలింది. అంతే!"

ఆయన కారే కన్నీటిని తుడుచుకోను కూడా లేదు.

రెండు చేతుల్లో మొహం దాచుకుని కూచుందామె! వాళ్ళిద్దర్నీ అట్లా చూస్తుంటే ఏదో ఆలోచన-అనుమానం వచ్చాయి అరుణ్‌కి!

చాలాసేపు అట్లా గడిచింది. "మమ్మల్ని చూస్తుంటే ఆశ్చర్యంగా వుంది కదూ?" అన్నాడాయన చిత్రంగా!

"కృష్ణ మీకు చెప్పాడో లేదో అతడికి ఆ పిల్ల దొరకక ముందు పెళ్ళి నిశ్చయమైంది. ముహూర్తాలు కూడా పెట్టుకున్నాక.." "ఆ ..కృష్ణగారు చెప్పారండీ! అన్నీ చెప్పారు-" అన్నాడు అరుణ్

"ఆ నిశ్చయమై తప్పిపోయిన సంబంధం మాదే-ఆ పిల్ల, అదే ఆ అమ్మాయి ఇదిగో మా అమ్మాయే చిత్ర..."

తన అనుమానం నిజమైంది అనుకున్నాడు అరుణ్

"అట్లాగా-?" అన్నాడు పైకి.

"ఎందుకు తప్పిపోయిందో కూడా మీకు తెలిసే వుంటుంది. ఇదిగో మా చిత్రే... పంతాలకు పోయి, లేనిపోనివి వూహించుకుని మూర్ఖంగా కాదంది. బంగారం లాంటి సంబంధం చేజారిపోయింది. ఆ అజ్ఞానంలో మేము తెలుసుకోలేక పోయాం. నేనుకూడా దానికే వంత పాడాను. దాని మాట కాదనలేక పోయాను. తత్ఫలితంగా దేవుడు లాంటి కృష్ణని దూరం చేసుకున్నాం... ఎంతో సహాయం చేసిన అతడి మేలుని మర్చిపోయాం. అతడి మనసుని బాధ పెట్టాం. అతడు మా కారణంగానే బ్రహ్మచారిగా వుండిపోయాడు.

చిత్రను విపరీతంగా ప్రేమించాడతడు. అందుకే వేరే స్త్రీని పెళ్ళాడలేకపోయాడు. అతడి పచ్చని జీవితాన్ని మేమే మోడులాగా చేశాం.

కాస్త ఇంగిత జ్ఞానం వుండి వుంటే, కాస్తయినా ఆలోచించగలిగి వుంటే మా జీవితాలే వేరుగా వుండేవేమో ?

మన కడుపున పుట్టిన బిడ్డని ప్రేమించినట్టు పరాయి బిడ్డని ఎందుకు ప్రేమించకూడదు? ఈ ఒక్క ఆలోచన వుండి వుంటే ఎంత హాయిగా వుండేవాళ్ళం? కృష్ణ లాంటి వాళ్ళు నూటికీ, కోటికీ ఒక్కళ్ళు వుంటారు. అట్లాంటి ఉత్తముడికి జీవిత సహచరిగా వుండి వుంటే మా చిత్ర జీవితమే ధన్యమయ్యేది..."

"నిజమండీ కృష్ణగారెంతో వున్నతులు" అన్నాడు అరుణ్.

"దానికి ఆ యోగ్యతే లేకపోయింది. పంతానికిపోయి వేరే సంబంధం చేసుకుంది. ముకుందరావుకి అనుమానం జబ్బు. పెళ్ళి

పది మొదలు చిత్రని పీడించుకు తిన్నాడు. "కృష్ణతో నీకు సంబంధం వుందన్నా"డట! "మీరు సినిమాలకు తిరిగారుట గదా షికార్లకెళ్ళారట గదా నువ్వు పని తురాలి వని ఎట్లా నమ్మమంటావు." అనేవాడుట!

"నువ్వు నాకు అక్కరలేదు పో... ఆ కృష్ణ దగ్గిరికే పో." అంటూ రకరకాలుగా బాధించ సాగడుట. శారీరకంగా హింసించేవాడు, కొట్టేవాడుట మాటలతో చిత్రవధ చేసేవాడు. ఎప్పుడైనా చిత్ర హైదరాబాద్ వచ్చినా కృష్ణ కోసమే వచ్చిందనే వాడుట!

అందుకని హైదరాబాద్ రావడం మాను కుంది. అన్నీ సహిస్తూనే, అక్కడే వుంది.

సంసార సుఖమంటూ ఎరగనే ఎరగదు. చాకిరీతో, తిట్లతో, దెబ్బలతో గడిచి పోయేవి రోజులు!

పిల్లలున్నా దాని జీవితం బావుండేదేమో? కానీ ఆ రాత కూడా లేకపోయింది దాని బతుక్కి!

కష్టాలు, కన్నీళ్ళు... కరడు గట్టి పోయింది—

ఒకొక్క సారి ఎదురు తిరిగేది—దెబ్బలు తినేది. వెళ్ళిపొమ్మని తరిమినా-నా దగ్గరికి వచ్చేది కాదు, తనే కుమిలి పోయేది. ఇంకో విషాదకరమైన సంగతి చెప్పనా? మా అమ్మాయికి, తనతో ఏ విషయంలోనైనా, ఎవరైనా పోటీకి వస్తే గిట్టదు మొదట్నుంచీ అదంతే. తనతో పోటీకి తమ్ముడో, చెల్లెలో వస్తున్నారని తెలిసి అశాంతి పాలయి మాకు దూరంగా వాళ్ళ తాతగారి దగ్గరికి పారిపోయింది—

ఆ తరువాత కృష్ణ ఆ పాపని, అదే నువ్వు చేసుకోబోయే ఆ పిల్లని, ఇంట్లో వుంచుకుని, తన ప్రేమని పంచి ఇస్తాడని, అతడి ప్రేమకి తనతో పోటీకి ఆ పిల్ల వస్తుందని, అది ఏ రకంగానయినా సరే, అందుకే... అందుకే...కృష్ణని పెళ్ళి చేసుకోకుండా కృష్ణకి దూరమయింది.

చివరికేమయిందో తెలుసా?

ఆమె భర్త అసలు ప్రేమనే ఇవ్వలేదు చిత్రకి! భార్యగా స్థానం కూడా ఇవ్వలేదు పైగా, నీవల్ల నాకు సుఖమే లేదంటూ నువ్వు గొడ్రాలివి అంటూ, తన మేనగోడల్ని తెచ్చి ఇంట్లో పెట్టుకుని, ఆ తరవాత కొన్నాళ్ళకి ఆ పిల్ల మెడలో పుస్తె కట్టాడట!

చిత్రమేమిటో తెలుసా? ఆ బాధని... ఆ పరిస్థితిని... ఆ చిత్రహింసని... మౌనంగా భరించింది చిత్ర! ఎక్కడికీ పారిపోలేదు అదీ జీవితమంటే..."

విషాదంగా నవ్వాడు ఆయన.

చిత్ర వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"ఆ విధంగా జీవితంతో రాజీపడి కాలం గడుపుతున్నా, అట్లా కూడా గడవ నివ్వలేదు విధి! మొన్ననే మూడు నెలల కిందట మా అల్లుడు పోయాడు.. ఇప్పుడు ఇంక అక్కడేం వుంటుంది? అందుకని దీన్ని నాతో తీసుకుపోతున్నాను. నేనున్నన్నాళ్ళూ దీనికి ఫరవాలేదు. ఆ తరువాత ఎట్లాగా అన్నదే తీరని ప్రశ్న..."

ఆవేదనగా అన్నాడాయన.

అరుణ్‌కి ఏం మాట్లాడాలో, వాళ్ళని ఎట్లా ఓదార్చాలో, తోచలేదు. మౌనంగానే వుండిపోయాడు.

*   *   *

కాచిగూడా స్టేషన్ సమీపిస్తోంది. తన సామాను సర్దుకుని దిగడానికి రెడీ అయ్యాడు అరుణ్. వాళ్ళకి సామాన్లు కట్టడంలో సహాయం చేశాడు. బెడ్డింగూ అవీ చుట్టి పెట్టాడు.

"ఆఁ! అన్నట్లు బాబూ, అడగడమే మర్చిపోయాను మీ పెళ్ళెప్పుడు? హైదరాబాద్‌లోనేనా? మేము తప్పకుండా వచ్చి ఆ ఫంక్షన్‌లో పాల్గొంటాం"

"ఇంకా ముహూర్తాలు నిర్ణయించ లేదండీ! దానికోసమే ఇప్పుడు నేను వెళ్తున్నాను. మీరు తప్పకుండా రావాలి మా పెళ్ళికి. కృష్ణగారు కూడా చాలా సంతోషిస్తారు, మిమ్మల్ని చూసి!"

"అమ్మాయి పేరు బాబూ?"

"శిల్పసుందరి."

"ఎంత చక్కని పేరు."

ఆ తరువాత తటపటాయిస్తూ అన్నాడు అరుణ్! "మీకో విషయం నేను చెప్ప లేదండీ..."

"ఏమిటది?" ఇద్దరూ కుతూహలంగా చూశారు.

"మొన్నీమధ్యనే...అంటే ఒక ఆరేడు నెలల క్రిందట... కృష్ణగారికి ఆక్సిడెంట్ జరిగింది. ఆ ఆక్సిడెంట్‌లో ఒక కాలు—ఒక చెయ్యీ పోయాయి. అంటే...డాక్టర్లు తీసేశారు. చాలా పెద్ద ప్రమాదం తప్పింది..."

"ఆఁ!" నోరు తెరిచి వుండిపోయాడాయన!

"కృష్ణా" అంటూ కూలబడిపోయింది చిత్ర!

"దానివలననే... మొదట పెట్టుకున్న మా పెళ్ళి ముహూర్తం వాయిదా వెయ్యాల్సి వచ్చింది." అంటున్న అరుణ్ మాటలు ఇద్దరూ వినిపించుకోలేదు.

స్టేషన్ వచ్చింది. రైలాగింది.

(ఇంకా వుంది)



# ధర్మపథం

## మూడు ప్రశ్నలు

ఒక సందేహ గ్రస్తునికి మరణతత్వాన్ని గురించీ, ముక్తిని గురించీ తెలుసుకోవాలనీ, తన సందేహాలు తీర్చుకోవాలనీ సంకల్పం కలిగింది. అతడు ఆత్మతత్వాన్ని తెలుసుకున్న ఒక మహానీయుని వద్దకుపోయి మూడు ప్రశ్నలు అడిగాడు. మొదట "స్వామీ! మృత్యువు చాలా పరితాపాన్ని కలిగించేదనీ, దుస్సహమైనదనీ అంటారు. అది నిజమేనా?" అని ప్రశ్నించాడు.

ఆయన "నిజమే! మృత్యువు పరితాపకరంగానూ, దుస్సహంగానూ కనిపిస్తుంది. ఎంత చెడ్డవాడైనా సరే, వాడు మరణించినట్లు తెలిస్తే పరితాపం కలగక మానదు. కాని ప్రతి దానికీ, ఉత్పత్తి స్థితిలయాలు సహజాలనే సంగతి తెలిస్తే పరితాపం నశిస్తుంది. ఇది ప్రాణులకూ, కూడా సామాన్య ధర్మమే. ఒక నిర్మాణం కొంత కాలం నిలిచి, తర్వాత క్షీణించి నశిస్తుంది. వృక్షం అంకురించి, ఆకులు పెద్దవై, కొన్నాళ్ళకు రాలిపోతాయి. పుష్ప, ఫలాల సంగతీ అంతే. మానవులకున్నూ, పుట్టుక, వృద్ధీ, ఎలా సహజమో, మరణం కూడా సహజమే! సహజమైన వాటిని గురించి పరితపించడంవల్ల ప్రయోజనం లేదు. ఆ సంగతి తెలుసుకుని మృత్యువును గురించి భయపడక ధైర్యంతోనే ఉండాలి. ఇట్టి భ్రాంతి అంతా మనకు అవిద్యవల్లనే ఏర్పడుతుంది. దానికి మనం లొంగిపోకూడదు." అన్నాడు. వెంటనే అతడు "అవిద్య అంటే ఏమిటి?" అని ప్రశ్నించాడు. ఆయన ఇలా సమాధానం చెప్పాడు.

"అవిద్య అంటే ఆత్మను విస్మరించడం. దేహమే ఆత్మ అని భ్రాంతి పడడం. ఆత్మను తెలుసుకునేటందుకు ఉపయోగించే విద్యయే విద్య. ఇతరములనుగూర్చి తెలియజేసే విద్యలు శాస్త్రానికి విద్యలు కావు. అజ్ఞానం వల్లనే ఆత్మను తెలుసుకోలేకుండా ఉన్నాం. అజ్ఞాన రూపమైన అవిద్య నశిస్తే ఆత్మతత్వాన్ని సులభంగానే తెలుసుకోవచ్చును. ఆ అజ్ఞానం నశించడానికే ఎంతో శ్రమపడి, విజ్ఞులు ఆత్మతత్వాన్ని తెలుసుకుని కృతార్థులవుతారు. దానివల్లనే ముక్తి లభిస్తుంది."

తర్వాత "ముక్తి అంటే ఏమిటి?" అనే ప్రశ్న వచ్చింది. ఆయన ఇలా చెప్పాడు— "ముక్తి అనేది కన్నులకు కనబడే పదార్థమేమీ కాదు. అవిద్యానాశమే ముక్తి. అవిద్యను పోగొట్టుకొని, ఆత్మతత్వాన్ని గ్రహించి, లౌకిక విషయాలతో సంబంధం విడిచి, నిర్లిప్తులై ఉండే మహానీయులు కొందరు లేకపోలేదు. అట్టివారినే 'జీవన్ముక్తులు' అని అంటారు. అవిద్యానాశంవల్ల అది కరతలామలకంవలె చాలా సులభమవుతుంది.

— బులుసు వేంకట రమణయ్య




నెలకి అయిదు రూపాయల చొప్పున అయిదు సంవత్సరాలు రికరింగ్ డిపాజిట్లో పొదుపు చేసిన సొమ్ము, వడ్డీతో కలిపి మూడు వందల అరవై రూపాయలు చేతికి వచ్చింది.

అరవై రూపాయలు పెట్టి పిల్లలిద్దరికీ స్కూల్ డ్రస్సు కుట్టించాను. ఇంకా మూడు వందలు మిగిలింది.

అవసరమైన ఖర్చులేవీ తయారుగా లేకపోవటం వల్ల ఈ మూడు వందలు ఏం చెయ్యాలి ?—అన్న సమస్య ఎదురైంది నాకు.

డబ్బు సంపాదించటం కష్టంగాని, ఖర్చు పెట్టటం తేలికే. మూడు వందల రూపాయలను మూడు నిమిషాల్లో ఖర్చు పెట్టెయ్యవచ్చు. దాని గురించి అంతగా ఆలోచించాల్సిన అవసరం లేదు. కాని, అయిదు సంవత్సరాలు—అంటే అరవై నెలలు ఎంతో జాగ్రత్తగా పొదుపు చేసి మిగుల్చుకున్న ఈ డబ్బును జల్సాగా ఖర్చు చేసి, చేతులు కడిగేసుకోవటం నా కిష్టం లేదు ఒక మంచి పని, నాలుగు కాలాల పాటు గుర్తుండేది చేసి, ఈ డబ్బుకు శాశ్వత కీర్తిని సమకూర్చాలని నా ఉద్దేశ్యం.

కరణేషు మంత్రీ అన్నారు భార్యని. కాబట్టి శ్రీమతి గారిని సలహా అడిగాను.

'నాకో పట్టు చీర కొని పెట్టండి!' అని ఆవిడ అనేసి వుంటే అంతటితో సరి! కాని, పొదుపు విషయంలో నన్ను మించిన చెయ్యి ఆవిడది. "కంగారుపడి దుబారా చెయ్యకండి. నెమ్మదిగా ఆలోచించి ఏదో ఒకటి చేద్దాం" అంది.

నాలుగైదు రోజులు గడిచిపోయినయ్. ఈలోగా ఒకసారి, ఏదైనా వస్తువు చేయించి మా ఆవిడ ఒంటిమీద పెడితే బావుంటుందన్న ఆలోచన వచ్చింది నాకు. కాని, కాసు బంగారం అయిదు వందల పైన అమ్ముతున్న ఈ రోజుల్లో మూడు వందలతో వస్తువేం చేయించగలను ? ఆ ఆలోచనకు స్వస్తి చెప్పి, మళ్ళీ మళ్ళీ ఆలోచించి, ఏదో సంతృప్తికరంగా లేక పోవటం వల్ల చివరికి నేషనల్ డెవలప్‌మెంట్ బాండ్లు కొనడమే సర్వదా శ్రేష్టమైన పని అని నిర్ణయించుకున్నాను. ఆ మాటే మా ఆవిడతో అన్నాను.

"వడ్డీ ఎంతిస్తారు ?" అడిగిం దావిడ.

"అయిదేళ్ళు అట్టే పెట్టుకుని ఏడాదికి పదమూడు శాతం చొప్పున వడ్డీ యిస్తారు. ఈలోగా అడిగితే యివ్వరు."

"పదమూడు శాతం అంటే ఎంతొస్తుంది ?"

"వంద రూపాయలు యిప్పుడు వేస్తే, అయిదేళ్ళ తరవాత వడ్డీతో కలిపి నూట అరవై అయిదు రూపాయ అవుతుంది. మూడు వందలు వేస్తే మూడు నూట అరవై అయిదులు—నాలుగు వందల తొంభై అయిదు రూపాయలు వస్తుంది."

"దాని కన్న ముక్కల సుబ్బారావు కిస్తే మెరుక్కాదూ!"

"ఏ ముక్కల సుబ్బారావు ?"

"అతనేనండీ—మన ఎదురింటి పంచలో వుంటున్న సుబ్బారావు!"

మా యింటి కెదురుగా వున్నది మూడు పోర్షన్ల డాబా యిల్లు. రెండు పోర్షన్లు అద్దెకిచ్చి, మూడో పోర్షన్లో వుంటున్నది యింటి వాళ్ళు. పక్కన వున్న కాస్త ఖాళీ జాగాలో చిన్న పంచ దింపి, రేకు కప్పించారు. పాతికేళ్ళ కుర్రాడు సుబ్బారావు భార్యా సమేతంగా ఆ పంచలో వుంటూ నెలకు పదిహేను రూపాయలు అద్దె చెల్లిస్తున్నాడు.

సుబ్బారావు వృత్తి బట్టల వ్యాపారం: పది పదిహేను రోజుల కొకసారి రాజమండ్రి వెళ్ళి చవక రకాల కట్‌పీసెస్ — జాకెట్ ముక్కలు, చొక్కా ముక్కలు మొదలైనవి కొని తెచ్చుకొని, ఊళ్ళమ్మట తిరిగి అమ్ముకుంటాడు. అతను అమ్మేవన్నీ ముక్కలే కనుక అతని వ్యవహార నామం ముక్కల సుబ్బారావైపోయింది. అతని వ్యాపారానికి పెద్ద పెట్టుబడి అవసరం లేదు. అవసరమైన కొద్ది మొత్తం కూడా అతని సొంత డబ్బు కాదు. వడ్డీకి అప్పు తీసుకొని వాయిదాల పద్ధతిలో తీరుస్తుంటాడు.

జాతీయ అభివృద్ధి బాండ్లను కొనటం కన్న ముక్కల సుబ్బారావుకి అప్పు యివ్వటం వల్ల మాకు రాబోయే అధిక లాభాన్ని గూర్చి సోదాహరణంగా వివరించి చెప్పింది శ్రీమతి.

వంద రూపాయలు అప్పు యివ్వదలుచుకుంటే—వడ్డీ కింద పదిహేను రూపాయలు ముందే మినహాయించుకొని, మిగిలిన ఎనభై అయిదు రూపాయలు సుబ్బారావు కివ్వాలి. రోజుకు రెండు రూపాయల చొప్పున యాభై రోజుల్లో వంద రూపాయలు తీర్చేస్తాడు సుబ్బారావు.

ఈ పద్ధతి నిజానికి లాభసాటిగానే కనిపించింది నాకు.

# కథ అడ్డం తిరిగింది!

"ఈ వివరాలన్నీ నీకెలా తెలుసు?" అడిగాను అనుమానంగా.

"మన యింటావిడ వాంచారమ్మ చాలా కాలంగా అతని కిస్తోందిగా. ఆవిడే చెప్పింది."

"రాత కోతలు లేకపోతే అతను తప్పకుండా తిరిగి యిస్తాడన్న నమ్మకం ఏముంది?"

"వాంచారమ్మ మొగుడికి తెలీకుండా చాటుగా యిస్తోంది. మూడో మనిషికి తెలీకుండా తిరిగి యిచ్చేస్తున్నాడతను. పైసా పెట్టుబడి లేకుండా అప్పుచేసి వ్యాపారం చేసుకొంటున్నాడు. ఆ మాత్రం నిజాయితీ లేకపోతే ఎలా గడుస్తుంది?"

"సరే అయితే. రేపు ఆదివారం కదా పొద్దున్నే కనపడమను. స్వయంగా మాట్లాడతాను."

రెండో రోజు ఆదివారం.

తెల్లవారక ముందే వచ్చి కూర్చున్నాడు ముక్కల సుబ్బారావు. నమస్కారం పెట్టి, తనను తాను పరిచయం చేసుకొని, వడ్డీ రేటు, మిగిలిన షరతులూ వివరంగా చెప్పాడు. నేను అడక్క ముందే నా అనుమానం గ్రహించినట్లు, తన నిజాయితీ గురించి సోదాహరణంగా వివరించి చెప్పాడు. ఒకసారి మాట తప్పితే రెండోసారి ఏ ముఖం పెట్టుకొని అడుగుతాను సార్? అన్నాడు. ఒకరికి ఎగ్గొడితే రెండోవారు దగ్గిరికి చేరనివ్వరు సార్ అన్నాడు. నీతి తప్పిన వాడికి విలువ నీడ దొరకదు సార్! అన్నాడు. అయిదేళ్ళ నుంచి మీ యింటిముందుంటున్నాను. నాలుగేళ్ళ నుంచి వాంచారమ్మగారి దగ్గిర అప్పు తీసుకుంటున్నాను. ఎప్పుడూ మాట తేడా రాలేదు సార్! కావాలంటే ఆవిడ్ని అడగండి సార్! అని గూడా అన్నాడు

అతని వాలకం, మాట తీరూ చూసిన తర్వాత అతని మీద పూర్తి నమ్మకం కుదిరింది నాకు. అయినా, ఎందుకైనా మంచిదని మరోసారి హెచ్చరించాను— "ఎలా తీసుకెళ్తున్నావో అలాగే తిరిగి యిచ్చెయ్యాలి. మాట తేడా రాకూడదు. మరో మనిషికి తెలియకూడదు. అలా జరిగితేనే నీకూ నాకూ కూడా మర్యాదగా వుంటుంది" అన్నాను.

"తప్పకుండా సార్! మీరే చూస్తారుగా.

మీ డబ్బు మీకు పువ్వుల్లో పెట్టి అప్పజెబుతాను. మళ్ళీ మళ్ళీ తీసుకెళతాను. తీరుస్తాను" అని, జేబులోంచి చిన్న పద్దుల పుస్తకం తీసి నా కిస్తూ "ఇదుంచండి సార్! ఏ రోజు దా రోజు యిందులో జమ రాస్తూ వుండమ్మ" అన్నాడు.

అప్పు తేవటం, యివ్వటం రెండూ అలవాటు లేని నాకు ఈ ఫార్మాలిటీ లన్నీ కొత్తగానూ, వింతగానూ వున్నాయి.

మూడు వందలకు మూడు పదిహేనులు వలభై అయిదు మినహాయించుకొని, రెండు వందల యాభై అయిదు రూపాయలు అతని కిచ్చాను.

"మీరు నాకు మూడు వందలు యిచ్చినట్టు లెక్క సార్! ఇవ్వాళ నుంచి రోజూ సాయంత్రం మూడు రెళ్ళు ఆరు రూపాయలు యిస్తూ వుంటాను. యాభై రోజుల్లో మీ అప్పు తీరిపోతుంది!" అని చెప్పి శలవు తీసుకు పోయాడు ముక్కాల సుబ్బారావు.

"ఆ వలభై అయిదూ యిలా యివ్వండి. ఒక డబ్బాలో వేస్తాను. ప్రతి రోజూ అతనిచ్చిన డబ్బు యిచ్చినట్టు ఆ డబ్బాలోవే దాస్తే బావుంటుంది" అంది శ్రీమతి.

ఆ ప్రతిపాదన నాకూ నచ్చింది.

ఏదో ఘనకార్యం చేసినట్టనిపించింది. కాస్త ఆలస్యంగానే అయినా మంచి పనే జరిగిందని సంతృప్తి పడ్డాను.

ఆ సాయంత్రం ఆరు రూపాయలు తెచ్చి యిచ్చాడు సుబ్బారావు.

పద్దుల పుస్తకంలో జమ రాసుకున్నాను.

రెండో రోజు కూడా యిచ్చాడు. పది రోజులు క్రమం తప్పకుండా యిచ్చాడు. పదకొండో నాడు యివ్వలేదు. అడిగితే— యివ్వాళ బేరానికి వెళ లేదు. రెండురోజులదీ కలిపి మరునటి రోజు యిచ్చేస్తానన్నాడు. కాని, ఆ మరునటి రోజూ యివ్వలేదు. అదేమిటంటే— యివ్వాళ అమ్మకం సాగ లేదు అన్నాడు.

ఇదేమిటంటే— "ఇదింతే లెండి. వ్యాపార మన్న తర్వాత అన్ని రోజులూ ఒక్కలా వుండవు కదా! నాంచారమ్మగారి క్కూడా ఒక్కొక్కసారి యిలాగే జరిగేది. ఒకటి రెండు రోజులు మధ్యలో యివ్వక పోయినా, అమ్మకం బాగా జరిగినప్పుడు ఆలాంటి బకాయిలు తీర్చేస్తుంటాడు.

అంత మాత్రానికే కంగారు పడిపోతే ఎలా?" అంది శ్రీమతి. నిజమే కాబోలు అను కున్నాను.

తరవాత వారం రోజులు గడిచి పోయినయ్. సుబ్బారావు ఒక్క పైసా జమకట్ట లేదు. మనిషి కూడా కనిపించటం మానే శాడు. తెల్లవారక ముందే మూట నెత్తు కొని పోయేవాడు. రాత్రి బాగా పొద్దు పోయిన తర్వాత తిరిగి వచ్చేవాడు.

నాకు అనుమానం పట్టుకుంది. పైకైతే అనలేదు గని మా ఆవిడకీ అను మానం కలిగినట్టుంది. ఒకనాడు సుబ్బా రావు పెళ్ళాన్ని పిలిచి అడిగింది. ఆ విష యాలు తనకేం తెలీవని నిర్మొహమాటంగా చెప్పేసింది ఆ అమ్మాయి. "అయితే మీ ఆయన రాగానే, ఎంత రాత్రైనా సరే ఒక సారి వచ్చి కనిపించమని చెప్పు" అంది. ఆ అమ్మాయి 'అలాగే' అంది కాని, సుబ్బా రావు మాత్రం ఆ రోజు గాని, ఆ మరునటి రోజు గాని వచ్చి కనిపించ లేదు.

రోజులు గడుస్తున్నకొద్దీ నాకు కంగారు ఎక్కువ కాసాగింది. మా ఆవిడ పరిస్థితి యించు మించు అలాగే వుంది. ఇదంతా తనవల్లే జరిగిందన్న వూహతో ఆవిడ బాధ పడుతున్నట్టు నేను గ్రహించాను. అయితే యిప్పుడు చెయ్య గలిగిం దేముంది? దయావో భయావో డబ్బులు వసూలు చెయ్యాలి.

మా శ్రీమతి ప్రోద్బలంతో ఒకనాడు తెల్లవారు జామునే లేచి, దారి కాచి, సుబ్బారావును పట్టుకున్నాను.

"ఏమయ్యా! ఇదేనా మర్యాద?" అన్నాను.

"బేరాలు సరిగా లేవండి."

"ఒక రోజు, రెండు రోజులు. పోనీ వారం రోజులు. అప్పటికీ మాటాడవు; ఇంకెంత కాలం ఆగమంటావు?"

"ఏం చెయ్యమంటారండి? అసలీమధ్య— బేరాలు అస్సలు లేవు. పొట్ట గడవటమే కష్టంగా వుంది."

అతని సమాధానం నాకు నచ్చలేదు. నా దగ్గర అప్పు తీసుకొని, నా ముందు అంత నిర్లక్ష్యంగా మాట్లాడటం నాకు కోపాన్ని తెప్పించింది. అతను కొంచెం అణకువగా సమాధానం చెప్పి వుంటే నాకు కోపం రాక పోను.

"అయితే ఏ మంటావు?" అన్నాను కాస్త కటువుగనే.

"నే నేమంటాను?"

"ఏమీ అనకపోతే సరిపోతుందా?"

"ఏమన మంటారో చెప్పండి పోని!"

మా సంభాషణ పక్కదారి పడుతున్న ట్టనిపించింది నాకు. ఇలాంటి విషయాల్లో బొత్తిగా అనుభవం లేనివాణ్ణి.

"అప్పు తీర్చమంటున్నానయ్యా!"

"తీరుస్తానండి."

"ఎప్పుడు?"

"డబ్బులున్నప్పుడు."

"ఎప్పుడుంటాయి డబ్బులు?"



"బేరాలున్నప్పుడు."

"బేరాలెప్పుడుంటాయి ?"

"సీజన్‌లో."

"సీజనెప్పుడు ?"

"బేరాలున్నప్పుడు."

ఒళ్ళు మండిపోయింది నాకు. ఇంక నిగ్రహించుకోలేక పోయాను

"నీ పద్ధతేం బావుండలేదు"

"మీ పద్ధతి అంతకన్న బాగోలేదు."

ఆశ్చర్యపోయాను అప్పు తీసుకున్న వాడు ఇచ్చిన వాడి ముందు వినయంగా వుండాలని, వుంటాడనీ నా ఉద్దేశ్యం. అప్పుడది జరగటంలేదు పైగా బాధగా వుంది నాకు

"అప్పు తీసుకున్నప్పుడు చూపే మర్యాద యిచ్చేటప్పుడు గూడా వుండాలయ్యా!"

"మర్యాద కెప్పుడూ లోటు లేదండి. కాని, మీరే నోటి కొచ్చినట్టు మాట్లాడు తున్నారు!"

"నేనా ?"

"అవును. మీరే! అప్పు యిచ్చినంత మాత్రాన మీరు యిష్టం వచ్చినట్టు

# కథ అడ్డం తిరిగింది!

మాట్లాడ వచ్చంటే యువతరం వాళ్ళు పడరండి మాకూ మానాభిమానా లున్నాయి. నడి రోడ్డు మీద నిలబెట్టి అడుగుతూ మర్యాద గురించి మాట్లాడు తున్నారు మీరు!"

కథ అడ్డం తిరిగింది! ఇంకేమన గలను ?

"డబ్బు తీసుకున్నప్పుడు ఏం చెప్పావు ? ఇప్పుడేం చేస్తున్నావు ? మాటన్న తర్వాత నిలబెట్టుకోవాలయ్యా! మానవజన్మ ఎత్తిన తర్వాత కాస్త నీతీ నిజాయితీ వుండాలి!" బాధ కోపం యిలా మాట్లాడించినాయ్ నన్ను

"నీతి, నిజాయితీ వుండబట్టే యింత సేపు మీ ముందు నిలబడి సమాధానం చెప్తున్నానండి అన్న మాటకి కట్టుబడి వుండాలనే యింకా మీకు అప్పు తీరుస్తా నంటున్నాను లేకపోతే ఏనాడో మీకు నేనేమీ యివ్వనక్కర్లేదు అనేసి వుందును!"

గతుక్కుమన్నాన్నేను.

"మీరు నాకేమీ యివ్వలేదంటే ఏం చెయ్యగలరు మీరు ?" నిలేసి అడిగాడు

నిజమే! ఏం చెయ్యగలను ? అతనికి నేను అప్పుయిచ్చినట్టుగా సాక్ష్యాధారాలేవీ లేవు. ఇప్పుడే కాదు, అప్పుతీసుకున్న మరు క్షణంలోనే అతనామాట అనివున్నా నేనేమీ చెయ్యగలిగేవాణ్ణి కాను

మళ్ళీ నోరెత్తితే అంత మాటా అనాల్సి వస్తుందన్న భయంతో "సరే, నీ చేతిలో వున్నప్పుడే యివ్వు" అనేసి వెనక్కి తిరిగి వచ్చేశాను.

ఆ తర్వాత నిర్భయంగా తిరగసాగాడు సుబ్బారావు. తరచు నాకు తారసపడుతూనే వున్నాడు అయినా గట్టిగా అడగ లేక పోతున్నాను నేను.

'మీకు నేనేమీ యివ్వక్కర్లేదు!' అని అతనితో అనిపించుకుంటే — అంతటితో నా బాకీ చెల్లు. ఆ సంగతి గ్రహించిన వాడిలా ఆ ప్రమాదం జరక్కుండా జాగ్రత్త పడుతూ ఏ నాటికైనా యివ్వకపోతాడా అన్న ఆశాభావంతో — నెలలు, సంవత్సరాలు ఎదురు చూస్తున్నాను —.




# పుష్కరాలకు వెల్‌కం

కుమారి రాగతి పండరి

# పెళ్ళిళ్ళకు గుడ్‌బై












# నళిని

## చిట్టారెడ్డి సూర్యకుమారి

*(గత సంచిక తరువాయి)*

సూర్యుడు పశ్చిమాద్రిని చేరకముందే జనులు చల్లగాలి దొరికే చోటికి వాహ్యాళిగా బయలుదేరుతున్నారు.

నళిని పవిత్ర పావనీలతో బయటికి వచ్చింది. రెండు జడలు వేసింది. పొడుగ్గా పిరుదులమీద వూయలలూగుతున్నాయి. చాక్‌లెట్ కలర్ బుట్టచేతుల బ్లౌజ్, అదే రంగు సోమ్రో, సాటన్ చీరలో శరీరచ్ఛాయ మరీ కొట్టుకొచ్చినట్లు కనిపించింది. పొడుగాటి మెడలో లావుపాటి పూసలదండ వేసింది. అదేరంగు చెవులకు స్టడ్స్ పెట్టింది. మాచింగ్ గాజులు — నళిని చెయ్యి పట్టుకుని,

"ఆంటీ నీవు చాలా అందంగా వున్నావు" అన్నాడు పవిత్ర.

"థాంక్యూ డార్లింగ్" అంది నళిని.

"ఆంటీ పెద్దయితే నీలాగ నేను అందంగా వుంటాను" అని పావని అంది.

"నీవు ఇంకా అందంగావుంటావు" అంది

"ఒకరినొకరు పొగడుకుంటూ యిక్కడే వున్నారా ?" అంది రాజకుమారి.

"మేము పార్క్‌కి వెళ్తున్నాం. మమ్మీ మీరెక్కడికి వెళ్తారు ?" పప్పి అడిగింది.

"ఆఫీసర్స్ మెస్సులో పార్టీ వుంది... నళినీ ! త్వరగా తిరిగి వచ్చేయండి..."

"మేము రావచ్చా" పిల్లలు అరిచారు

"నయ్" అంది.

"ఆంటీ వస్తుందా ?"

"ఆంటీ పిల్లకాదుగా ! వస్తుంది..."

"త్వరగా వెళ్దాం — ఆంటీ" అంటూ చెయ్యి పట్టుకొని లాక్కుపోసాగారు. రోడ్డుమీదకు వచ్చారు...

"అరే పుస్తకాల అంగడి తెరచివుందేం" అంటూ కదిలింది నళిని.

"మమ్మీకి తెలుసు అతను పుస్తకం తీసుకుంటే డేకి పావలా. నీకు ఎన్నికావాలో తీసుకో" అన్నాడు పవిత్ర

స్టార్‌డస్ట్ — షెమినా తీసుకొని యాభై పైసలు యిచ్చింది. ఆ షాపులు చూసుకుంటూ ముందుకు నడిచారు. సత్యా టాకీస్ దగ్గరకి వచ్చారు. తీరిగ్గా హాలులోకి పోతున్నారు జనం. రంగురంగుల పోస్టర్లు, ఆకర్షిస్తూ లోపలికి రమ్మంటున్నాయి.

"ఆంటీ మనం మూవీకి యెందుకు పోకూడదు ?" అన్నాడు.

"నాకు చాలా ఇష్టం." పావని అనుకుంది.

పెద్దదానికే టెంప్టేషన్‌గా వుంది. పిల్లలకి వుండదా ? అనుకుని తలూపింది. సంతోషం పట్టలేక పిల్లలు అరిచారు దారిన పోయేవాళ్ళు వాళ్లనే చూస్తున్నారు. పది రూపాయలు తీసి పవిత్రకి ఇచ్చింది. పెద్దమొగాడిలా పరుగున వెళ్ళాడు బుకింగ్ దగ్గరకి. టికెట్లు పట్టుకొని చిల్లర జేబులో వేసుకొన్నాడు. ఇటు, ఇటు అంటూ పావని చెయ్యి పట్టుకొని పరుగుతీస్తూ ముందుకు లాగింది. ఒక మూలకి వెళ్ళి అక్కడ కూర్చున్నారు పిల్లలకి ఏదో అడ్వెంచర్ చేసినట్లు ఉత్సాహంగా వున్నారు.

"డాడి పర్మిషన్ తీసుకోనందుకు,మమ్మీకైనా చెప్పలేదే" అంది పావని.

ఏదో పోకిరిపని చేసినట్లు నవ్వుకున్నారు.

ఎవ్వరి గదుల్లో వారు పడుకున్నాక, నళిని ఒక్కతే ఆ గదిలో పడుకోలేక మెల్లగా దిగి వచ్చి, పిల్లల మధ్యన చేరేది. పిల్లలు నాదగ్గర పడుకో ఆంటీ నాదగ్గర ఆంటీ అనేవారు. చివరికి ముగ్గురూ ఒక మంచంమీద చేరేవారు.

"ఆంటీ నీకు భయమా ?" పవిత్ర అంటే,

"నేను మీలాగా కాన్వెంటులో చదవలేదు. మిలటరీ రూల్సులో పెరుగలేదు."

"అందుకేనా నీవు ఇంగ్లీష్ ఫ్లూయెంట్‌గా మాట్లాడలేవు" అన్నాడు పవిత్ర

"అవున్రా బాబు. ఇంట్లో బయట తెలుగే చివరికి కాలేజీలో లెక్చరర్స్ తెలుగులోనే తిట్టుతారు మరి మీలాగ రమ్మంటే యెలా వస్తుంది ?"

"ఆంటీ నీవు గ్రాడ్యుయేట్‌వి కదా !" ఆశ్చర్యంగా అడిగింది పావని.

"ఆ గాలివాన గ్రాడ్యుయేటు. అయినా తెలుగులో మాట్లాడ్డం నాకు ఆనందంగానే వుంటుందికాని, మీరు తెలుగులో మాట్లాడితే వచ్చిండ్రు, పోయిండ్రు అని, తెలుగువాళ్ళు మిమ్మల్ని చచ్చినా చేసుకోరు" అంది

పవిత్ర ఆలోచనలో పడ్డాడు. పావని లేచి కూర్చుంటూ "మురళి నన్ను చేసుకుంటాడు గ్రాండ్ మా చెప్పింది" అంది కళ్ళు విప్పారించి

"నేను ఆంటీని చేసుకుంటా" అంటూ చెయ్యి పైన వేసి కరచుకున్నాడు పవిత్ర.

"ఒరే ఒరే నేను అమ్మను అవుతానురా" అంది పకపక నవ్వుతూ. అలా మాట్లాడుకుంటూ నిద్రపోయారు...

తెల్లవారి ఆరుగంటలకల్లా పిల్లల్ని లేపటానికి వచ్చింది రాజకుమారి. ఒకరిమీద ఒకరు పడుకున్న తీరు చూసి, భర్తను పిలిచింది మెల్లగా పిల్లలు లేవటానికి మొండి చేస్తున్నారేమోనని చేతికర్ర పట్టుకొచ్చారు, రావుగారు.

వాళ్ళని చూసి నొసటిమీద కొట్టుకుంటూ వెళ్ళారు.

"మీ చెల్లెల్ని యం. ఏ. చదివించాల్సిందే" అన్నాడు అప్పుడు...

* * *

వున్నట్టుండి నళిని "బాబు మీ నాన్న అంటే నాకు భయం. ఏమంటారో పిక్చర్‌కి వచ్చామని" అంది.

"డాడీ స్వీట్ డాడీ. మంచి డాడీ. ఏమీ అనరు." పవిత్ర అన్నాడు.

"డార్లింగ్ డాడ్" అంది పావని.

"మీ మమ్మీ ఇష్టమా ? డాడీ ఇష్టమా?" అని అడిగింది నళిని.

పవిత్ర పెద్దవాడు కదా ఇద్దరూ ఇష్టమే అన్నాడు. పావని ఆలోచించి "నాకు డాడీ అంటేనే ఎక్కువ ఇష్టం" అంది. "డాడికి కూడా పావని అంటేనే ఇష్టం ఎప్పుడూ కిస్ చేస్తారు" అన్నాడు పవిత్ర. పప్పి ముఖం గర్వంతో వెలిగిపోయింది.

"పవిత్రా అది చిన్నదని ముద్దుచేస్తారు యు ఆర్ ఎ మాన్" అంటూ వాడి బుగ్గ ముద్దు పెట్టుకుంది

అంతలోకి సినిమా మొదలుపెట్టారు. పిల్లలు ముందుకు వంగి ఇష్టంగా చూస్తున్నారు. పాటలు, డాన్సులు అయ్యాయి జమీందారు దుర్మార్గుడు. ఆ ఎస్టేట్‌లో పని చేసే అందమైన అమ్మాయిని తెప్పించి రేప్ చేస్తుంటాడు హీరోయిన్ను రేప్ చేయబోతాడు.

"ఆంటీ ! ఆంటీ ! అతను యెందుకు హీరోయిన్ని లాగుతున్నాడు ?" అని పావని అడిగింది.

రేప్ చేస్తున్నాడని యెలా చెప్పటం. చెప్పినా అర్థంకాదు. అందుకని "ఆ అమ్మాయి సొమ్ములు తీసుకుంటున్నాడు ... చూడు తర్వాత చెప్తాను" అని మెల్లగా చెప్పింది

ఓ బలమైన చెయ్యి ముందుకు వచ్చి నళిని బుగ్గల్ని గట్టిగాపట్టి ప్రక్కకి తిప్పింది. భయంతో కళ్ళు విప్పారించి చూసింది. ఆ చీకట్లో అజయ్ కళ్ళు మెరుస్తున్నాయి. బుగ్గలు వత్తిపట్టటంతో పెదాలు విచ్చుకున్నాయి అలా విచ్చుకున్న పెదాల్ని గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు. వూపిరి పీల్చుకోవటం మరచిపోయింది జమీందారుకి, హీరోకి స్టంటు జరుగుతోంది పిల్లలు సినిమాలో నిమగ్నమైపోయారు దగ్గర్లో అట్టే జనం లేరు చుంబనంలో కచ్చ, కోపం, ఆనందం మిళితమైనాయి వూపిరి పీల్చుకోవటంకోసం,

---

**జరిగిన కథ-4 :** తమ కాలేజీ చదువు ముగించుకొని బయటపడ్డారు వాసవి, నళినీలు తరువాత వాసవితో కలిసి వాళ్లవూరు వెళ్తుంది నళిని. అక్కడి ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణానికి పరవశించిపోతుంది. కొన్నాళ్ళకు ఆ వాతావరణం విసుగుపుట్టగా, బావ మోహన్‌తో కలిసి వాసవి, నళినీలు లేపాక్షి వెళ్ళి అక్కడి సుందరమైన శిల్పములను, వాటి చరిత్రను తెలుసుకొంటారు. అక్కడినుండి హైద్రాబాద్‌లోని తనవాళ్ళ దగ్గరకు వెళ్తుండగా, రైల్వేస్టేషన్‌లో పరిచయమైన కెప్టెన్ అజయ్, తనని ప్రేమిస్తున్నానని చెప్పగా ఆశ్చర్యపోతుంది నళిని.

---

చెయ్యిపట్టి అజయ్ ముఖాన్ని దూరంచేసింది. నళిని హృదయం ఉద్వేగంతో వేగంగా కొట్టుకుంటుంటే గుండెలమీద చెయ్యి పెట్టుకొంది. తన పెదాలు ఇంకా అక్కడే వున్నయా అనుకున్నట్లు మెల్లిగా తుడుచుకొంది. అక్కడే వుంటే ఇంకేం చేస్తాడోనని భయంతో లేవబోయింది. భుజంమీద చెయ్యివేసి గట్టిగాపట్టి అదుముతూ "మూగపిల్ల మాట్లాడుతుంటే ఆనందం పట్టలేకపోయాను. యు...నాటి గర్ల్" చెంపమీదుగా వంగి మందస్వరాన అన్నాడు.

మంత్రం వేసినట్లుండిపోయింది.

"హల్లో మున్నా!" అంటూ పవిత్రని పలుకరించాడు.

"హాయ్! అజయ్ అంకుల్!" అన్నారు ముక్తకంఠంతో.

"మమ్మీ, డాడి రాలేదా? ఈవిడ ఎవ్వరు?" అని ఇంగ్లీషులో అడిగాడు.

"మీట్ మై ఆంటి నళిని, బి. ఏ." లంటూ అజయ్‌కి పరిచయం చేశాడు

"గ్లాడ్ టు మీట్ యు" అంటూ తమాషాగా కళ్ళు కదిలించాడు అజయ్. అజయ్ వెంబడి పిల్లలు బయటికి వెళ్ళారు. పాప్‌కార్న్ కొనిచ్చాడు వాళ్ళు డ్రింక్స్ తాగుతుండగా గోల్డ్‌స్పాట్ తీసుకొని వచ్చాడు. నళిని చూడనట్లు వూరుకుంది మెల్లిమెల్లగా అతనిమీద కోపం రాసాగింది ఆ పౌర్జన్యం, ఆ చనువుకి వళ్ళు మండింది.

అంతా అతని ఇష్టమే ప్రేమించటం. పక్కసీటులో కూర్చుని చెయ్యి అందుకొని చేతిలో వుంచి "తీసుకోకపోతే ఎలా తాగించాలో తెలుసు" అన్నాడు చిరునవ్వుతో.

సినిమా అయిపోయేటప్పటికి మరి రెండుసార్లు ముద్దుపెట్టుకున్నాడు. "డార్లింగ్ ఐ లవ్ యు" అన్నాడు.

ఆ రాత్రి నళిని కళ్ళు మూసుకుని, మగవాడి అధరాలు, అంత సున్నితంగా మెత్తగా వుంటాయా! అని అనుకుంది.

* * *

కొన్ని అహోరాత్రులు గడిచాయి. వాసవి విషయాలు వున్నా లేకపోయినా ఉత్తరాలు వ్రాస్తూనేవుంది. "తొందరలో పెళ్ళి చేయాలని అమ్మ పట్టుబట్టినట్టు, కావలసిన సరంజామా అంతా సమకూర్చుతుంది. చెప్పకోటానికైనా అమ్మాయి కనీసం యం. ఏ. అయితే బాగుంటుంది అని నాన్నగారు అంటున్నారు.

"చెప్పకోటానికైతే, పెళ్ళి చేశాకనే చదివించుకోండి." అని ఖచ్చితంగా తేల్చేసింది. నీ అభిప్రాయమేంటి? చదువుదామా? పెళ్ళి చేసుకుందామా?" అని వ్రాసిన వుత్తరాన్ని ముద్దు పెట్టుకుంది నళిని.

తన ప్రణయగాథని ఏ రోజు వార్త ఆ రోజు వ్రాసి పోస్టు చేస్తూనేవుంది నళిని. "పవిత్ర పావనీలతో నేను ఎక్కడికిపోయినా పిలిచినట్లు ఆ సమయంలో అక్కడ వుంటాడు అజయ్. జులాజికల్ పార్క్‌కి వెళ్ళాం. అక్కడా హాజరైనాడు. మనం చూసినప్పటికంటే ఇప్పటికి ఎంతో మారిపోయింది. నీతో, అజయ్‌తో కలిసి మళ్ళీ మళ్ళీ ఆ ప్రదేశమంతా తిరగాలనివుంది నాకు. మనం అరవై ఐదులోకదూ చూశాం. అప్పుడే బిగినింగ్ స్టేజ్‌లో వుంది. ఏవో కొన్ని పక్షులు, జంతువులు మాత్రం వున్నాయి. ఇప్పుడు ఎన్నో!



దెప్పకోదగినవి 'లైయన్ సఫారి పార్క్' ప్రి హిస్టారిక్ జంతువుల పార్క్ అహహ అప్పటి జంతువులు వున్నాయనుకుంటున్నావా? కాదు. అవి ఎలా వుండేవో, ఎంత పెద్దవో, డైనోసార్స్ జాతి జంతువులు లైఫ్ సైజ్, ఫైబర్ గ్లాస్‌తో చేసిన మోడల్స్ పది ఎకరాల చిత్తడి నేలతో ఏర్పాటు చేశారు. 50 అడుగుల పొడవు, 20 అడుగుల ఎత్తు బల్లి ఆకారంలో ఎంతో పెద్దది. మరొకటి ఏనుగు శరీరంలా పెద్ద తలతో తోక పెద్దగా నేలకంటుతూ వుంటుంది. అవి మోసోజోక్ ఎరాలో వుండేవి. (120) నూట ఇరవై మిలియన్స్ సంవత్సరాల వెనుక వాటి ఫోసిల్స్ శిలారూపమై పోయిన జంతువులు – అదిలాబాద్ జిల్లా యామినె పల్లిలో దొరికాయట.

బల్లిలా వుంటుంది – టైరానో సారస్ దాని పొట్ట క్రింద నిలబడివుంటే (దాని ముందు చేతులు పొట్టివి పైకెత్తుకొని వుంటుంది.) అజయ్ ఫొటో తీశాడు. అప్పుడు బావ తీసిన ఫొటోలు పంపారా? లేక బై బై అన్నారా?

పిల్లల కొరకు రైలు వుంది. పిల్లలకంటె పెద్దవాళ్లు చిన్నతనం గుర్తుకు తెచ్చుకుంటున్నట్లు ఎంజాయ్ చేస్తారు. చిల్డ్రన్ కార్నర్‌కి దగ్గర వుంది 'స్వాన్ స్టేషన్' దానిపేరు. చిలక జాతి మరో పక్షి ఒంటరిగా పంజరంలో కర్కశంగా అరుస్తు వుంటుంది ఫారెస్ట్ రెస్ట్ హవుస్ దగ్గర. పిల్లల పార్క్‌లో ఏనుగు, ఒంటె వున్నాయి. వాటిమీద పావనీ, పవిత్ర స్వారీ చేశారు. 'అంకుల్' ఫొటో, ఫొటో అని కేక వేశారు.''

''నీవు తోడుగా వుంటే నాకు స్వారి చేయాలని వుంది. తక్కినవి మనం చూసినవే. కాని రాక్షసి లాంటి తాబేలును చూడలేదు మనం. రంగు రంగుల పక్షులు, జాతి ప్రకారం వాటికి సహజ పరిస్థితుల్లో, వాటి నివాసం ఏర్పాటుచేశారు. వాసవీ! ఆ పక్షుల్ని, జంతువుల్ని చూస్తుంటే మనస్సు ఎంతో ఆనందం, ఇంకా ఇంకా చూడాలనిపిస్తుంది. ప్రకృతికి అవి అలంకారాలు. అందుకే 'ఈ జంతువులు, పక్షులు మనకు లేకుంటే, రంగులులేని ఈ జీవితంలో వుత్సాహం లేకుండావుండేది.' అని నెహ్రూగారన్నారు.''

# నళిని

''వాసవీ! ఈ మిలటరీవాడు బావగారిలా నెమ్మదైనవాడు కాదు. వట్టి పోకిరి. నా స్పర్శ కోసం తపిస్తున్నట్టు వుంటాడు. ఆ రోజు సినిమా హాలులో జరిగిన తర్వాత ఒంటరిగి ఎప్పుడు దొరకలేదు. పచ్చికబయలులో కూర్చున్నాము. చేతిలో రేఖలు చూస్తున్నట్టుగా చెయ్యి అందు కున్నాడు. పిల్లలు అజయ్ చెప్పేది వింటానికి పైనబడ్డారు. చేతిని తుడుస్తున్నట్టు, రేఖలు పరీక్షిస్తున్నట్టు గట్టిగా అదిమేవాడు. నేను నవ్వును దాచుకునేదాన్ని. ''పెళ్ళి తొందరలో అవుతుందన్నాడు. నీకో ప్రాణస్నేహితురాలు వుందన్నాడు.'' పిచ్చిపిల్లలు నిజం—నిజం అంకుల్ అని అరిచారు. వాళ్లు అలా అరుస్తున్నప్పుడు చేతిని గబుక్కున పెదాలకి తాకిచ్చుకున్నాడు. చేతిని వదిలించుకోలేకపోయాను. ''పిల్లలు ఇద్దరు లేక ముగ్గురు'' అన్నాడు. గొప్ప, ఈ కాలంలో అంతేగా పెద్దగా నవ్వాను.

''నీ నవ్వు నా హృదయంలో గిలిగింతలు పెట్టుతుందన్నాడు'' మెల్లిగా. పిల్లలకి తెలియకుండా ఇంగ్లీషులో మాట్లాడుకోలేం. వాళ్ళకి హిందీ, మరాఠీకూడ వచ్చు. నన్ను చూస్తాడు. అతని ప్రశంసపు మాట 'ఇచ్చిబాన్' అంటాడు. అంటే ''ఫస్ట్‌గా వుందన్న మాట. జపాను భాషలో...'' అని వ్రాస్తుంటే ఒకసారి పబ్లిక్ గార్డెన్‌లో ''ఇచ్చిబాన్, ఇచ్చిబాన్'' అంటున్నాడు. కళ్లు కొంటెగ, అదోమాదిరి ఎరుపు కనుపించగ, కళ్ళు క్రిందకి వాల్చుకుంది. అప్పుడు ని తెలిసి రాలేదు. తనకి – లోనెక్ జాకెట్, పైట తొలగి వుంది. గుండె ఆగిపోయింది. కోపంతో పెదాలు బిగించి, చెళ్ళుమని అజయ్ తొడమీద ఒకటి చరచింది. ఓ చెట్టును కొట్టినట్టుండింది. అది జ్ఞాపకం వచ్చింది నళినికి. వుత్తరం పోస్టు బాక్స్‌లో వేయనువచ్చింది. చెట్టుక్రింద అజయ్ నిరీక్షిస్తున్నాడు.

* * *

యామిని వాణిలావుంది. ఆది దంపతులైన యామి, యముని కాలంలో ఎప్పుడూ పగలే కాని రాత్రి లేదట. యముడు చనిపోయాడు. యామి ఎప్పుడు ఈ దినమేనా భర్త చనిపోయిందని, ఏడుస్తూ వుండేదిట. దేవతలు ఎంత చెప్పిన ఆమె మరచిపోలేకపోయింది. అప్పుడు దేవతలు రాత్రిని కల్పించారు. ఆ రాత్రి తర్వాత యామి భర్తను మరచిపోయింది.

దుఃఖితులకు రాత్రి ఔషధమువంటిది. చనిపోయినవారికోసం దుఃఖిస్తు వుంటే ఆత్మీయులు ఎంత కాలం జీవించగలరు? మరుపనే వరం దేవుడిచ్చిన వరం.

దక్షిణపు వాకిళ్లు తెరుచుకున్నట్టు నక్షత్రాలు సంయమని పట్టణంలోకి చూస్తున్నట్టు తళుక్ మంటున్నాయి.

యముడు శ్యామలాదేవితో చీకటి తెరలమీద గగనయానం చేస్తున్నాడు. ఆ ధర్మజుని వెనుక వచ్చిన నలుగురు వ్యక్తులు భూమి పైకి దిగుతున్నారు తలగుడ్డ భుజాలమీదుగ తెల్లని దుప్పట్లు కప్పుకుని, కర్రలు చేతపట్టుకుని రైతుల్లా వున్న ఇద్దరు వచ్చి బయట లోగిలి ముందు నిలుచున్నారు. వెంకట్రావు వులిక్కిపడి మేల్కొన్నారు. తను కలకన్నాడు. ఆది కలకాదు. స్పష్టంగా చూశాడు. భ్రాంతి కాదు. నుదుటి మీద స్వేదాన్ని తుడుచుకోలేకపోయాడు. పెదాలు తడారిపోయాయి. హృదయం బరువు, శరీరం తేలిగ్గా వున్నాయి. ఆ అనుభూతి చెప్పలేనిది. తలతిప్పి చూశాడు. అరుగుమీద పడుకున్న భార్యను 'శకుంతలమ్మా' అని పిలిచాడు. అంత నిద్రలో వున్నా ఒక్క పిలుపుకే పలికింది. లేచింది. తలవైపునున్న నీళ్ళచెంబులోనుంచి గ్లాసులోకి నీళ్ళు వంపి, నిద్ర కళ్ళతో జాగ్రత్తగా దిగి భర్తకు అందించింది. గ్లాసు గడగడమని త్రాగేశాడు. మరో గ్లాసు వంచింది. ప్రీతి నోటికి ఆవించుకొని తాగాడు. వెళ్ళిపోతున్న భార్యను పిలిచి మంచంమీద కూర్చోమన్నాడు. నిద్రతో కళ్ళు కూరుకుపోతుంటే అలాగే కూర్చుంది. ''శకుంతలమ్మ! నేను చేయవలసిన పని ఇంకేం మిగలలేదనుకుంటాను.''

''వూ''

''ఆస్తి పెంచాను. అబ్బాయిలందరు పెళ్ళాలతో స్థిరపడినట్టే, అమ్మాయి జాగ్రత్త. దానికి పెళ్ళి అయినట్లే లెక్క. మోహన్ అమ్మాయికి ఏమి తక్కువ చేయడు.''

''ఊ.''

''నీ జీవితం చల్లగా వెళ్ళిపోతుంది.'' ఆ మాటకి కళ్ళు పూర్తిగా తెరచింది శకుంతలమ్మ. ఆ కళ్ళల్లో ఆందోళన చూసి వెంకట్రావ్‌గారు నవ్వుకున్నారు మెల్లిగా.

''వృద్ధాప్యంలో భర్తకంటే కొడుకులే తల్లికి ఆధారం.''

''ఏమిటీ మాటలు. పడుకోండి'' అంటూ భర్తను చూసింది. ఏ అనారోగ్యం వున్నట్లులేదు. తేలిగ్గా నిట్టూర్చింది. కాళ్ళ దగ్గర కూర్చుని కాళ్ళు పట్టుతూ ''ఏమైనా పీడకల వచ్చిందా?'' అంది ఆవలిస్తూ.

దేవుణ్ణి స్మరిస్తూ కళ్ళు మూసుకున్నారు



టిన్ను ముందువేపైతే
ఆరోగ్యపానీయమనే
పేరుంటూ వెనకపక్క
'కృతకంగా రుచి
చేర్చబడినది
అని ఉందా?

Artificially Flavoured

# అయితే సహజమైన కోకో, పాలు, మాల్ట్, పంచదారగల రుచికరమైన న్యూట్రామూల్ తాగటం మొదలెట్టండిక

టిన్నును ఒక్కసారి వెనక్కితిప్పి చూడండి. ఏమిటి, కృతకమైన రుచిగల పానీయాన్ని తాగుతున్నారా ? ఆ టిన్నుపైన 'Artificially Flavoured' అనిగనక వుంటే, అది మీ కుటుంబపు ఆరోగ్యానికి అది తగిందా అని? ప్రకృతి సహజమైన ఆరోగ్యాన్నిచ్చే పానీయాన్ని తాగి, ఆ అసలైన ఆనందాన్ని పొందండి- న్యుట్రామూల్. న్యుట్రామూల్‌లో రుచికరమైన కోకో, మాల్ట్, పాలు, పంచదార మాత్రమే ఉన్నాయి. ఇందులో కృతకమైనది ఏమీ లేదు. అందుకే, న్యుట్రామూల్ తాగండి—అసలైన ఆనందాన్ని పొందండి. న్యుట్రామూల్—అముల్ వారిది.




అముల్ వారి

**న్యూట్రామూల్** ప్రతి కప్పూ మీకు పోషణను ఇచ్చు

daCunha GC

వెంకట్రావుగారు. తూర్పు తెల్లబడింది. వెంకట్రావుగారింటి నుంచి అంగలార్పులు వచ్చాయి. సూర్యుడు తన కొడుకైన యముడ్ని తలంచుకుంటూ మెల్లిమెల్లిగా పైకి వస్తున్నాడు.

"నాన్నగారు స్వర్గస్థులయ్యారు" అని వాసవి దగ్గరనుంచి టెలిగ్రాం చూసి నళిని అక్కజపడింది.

* * *

బంగ్లాదేశ్ స్వతంత్రపు బావుటా ఎగురవేసింది. పశ్చిమ పాకిస్తాన్, ప్రభుత్వాధికారులు, తూర్పు పాకిస్తాన్ శాశ్వతంగా తమనించి విడిపోతుందని భయపడ్డారు. బంగ్లాదేశ్ స్వతంత్రపు గాలులు పీల్చుకోవటం సహించరాని నేరంగా ఎంచారు. ఏ ప్రభుత్వం పూరుకోదు అన్నారు.

ఆ సమయంలో జనరల్ తిక్కాఖాన్ ఢక్కాలోని పశ్చిమ పాకిస్తాన్ సైన్యాలపై ఆధిపత్యముండను కున్నాడు.

తిక్కాఖాన్ నిర్దయుడు. తడిగుడ్డలతో గొంతులుకోసేరకం. కసాయివాడ జంతువులను నరికితే, తిక్కాఖాన్ మనుష్యులని నరికే కసాయివాడు. సివిల్ డ్రస్సులో పాకిస్తాన్ సైనికులు ఢక్కాకి వచ్చిన తర్వాత యాహ్యా — ముజిబుర్ రహమాన్‌తో సంప్రతింపులు జరుపటానికి వచ్చాడు. గోముఖ వ్యాఘ్రం. యాహ్యా సంప్రతింపులు జరిపి మన ఎత్తుగడలు సాగవనుకొని తిరిగి పాకిస్తాన్‌కు వెళ్ళిపోయారు. ఆ సాయంత్రమే తిక్కా సైనికులు బంగ్లాదేశ్ మీద విరుచుకుపడ్డారు. రేగిపోయారు. బంగ్లాదేశ్‌ను వెన్నుపోటు పొడవసాగింది.

హిందూదేశం ధర్మయుద్ధం చేసేది. ధర్మానికి, నీతికి, పౌరుషానికి పెట్టింది పేరు యుద్ధం ప్రకటించాకనే తలపడేది. సూర్యుడు అస్తమించగానే ఆరోజుకి యుద్ధం సమాప్తి అయినట్టు బూరలు పూదేవారు. ఆరాత్రికి సైనికులు, తిని, త్రాగి, విశ్రాంతి తీసుకొని సూర్యోదయంతోపాటు రణరంగంలోకి దూకేవారు. ఆ రాత్రి ఇరుపక్షాలవారు యుద్ధభూమిలో గాయపడ్డవారిని, సురక్షితమైనచోటికి తరలించి వైద్యసదుపాయాలు కల్గించేవారు. అనాదిగా వస్తున్న ఆచారం కట్టుబాటు.

పాకిస్తాన్ సైనికులు తిక్కా ఆధిపత్యంలో దొంగలుగా, హంతకులుగా మానభంగం చేస్తూ సైతానుల్లా విజృంభించారు. ఆ సైనికుల కాళ్ళ క్రింద ఢక్కా పట్టణం వణికిపోయింది. టాంకులతో కదం పోయింది. టాంకులు భూమిని దద్దరిల్లిస్తూ వీధులు, వీధులు తిరిగాయి. ఎదురొచ్చిన ప్రతి మనిషిని కాల్చారు. ఇండ్లల్లో దూరి మనుష్యుల్ని వీధుల్లోకి లాగి లాగి కాల్చారు. పోలీస్ స్టేషన్‌ల మీద, కార్యాలయంపై నిర్దయగా పేరంగులు కాల్చారు. నిరాయుధులైన అమాయక ప్రజలు చీమల్లా మాడిపోయారు. బంగ్లాదేశ్‌కి ఆయువుపట్టు అయిన విద్యార్థులు నిద్రించు చుండగా, మెషిన్‌గన్‌లతో వారిని పొట్ట పెట్టుకుంది. రజియా సుల్తానా లాంటి విద్యార్థినులు దేశంకోసం జీవితాలను త్యాగంచేసి, మానాలను రక్షించుకున్నారు. ఎదురొస్తున్న

## న ళి ని

టాంకులపైకి పై బిల్డింగు నుంచి, బాంబులు పట్టుకొని దూకారు. వీరవనితల ముందు సిగ్గుపడవలసిన సైనికులు, ధర్మాన్ని నీతిని విసర్జించారు.

మేధావంతులైన సైంటిస్టులను, వైద్యులను, పండితులను, కవులను ఒక్కరిని విడువలేదు. ఆర్మీ హెడ్‌క్వార్టర్స్‌కి వెళ్ళిన ఏ ఒక్కరు తిరిగిరాలేదు.

ఢక్కా పట్టణంలో మానవ మారణహోమం చేసిన ఖ్యాతి తిక్కాకి దక్కింది. శిథిలమైన ఢక్కా పట్టణం నుంచి తిక్కా శీతల చూపులు గ్రామసీమలవైపుకు మళ్ళింది. పాకిస్తాన్ సైనిక గుంపులు జనపదాల్లోకి అడుగుపెట్టాయి. అడుగుపెట్టిన ప్రతి పల్లె నేలమట్టమైంది. ఇండ్లకు నిప్పుపెట్టారు. ముస్లింలను, హిందువులను కత్తులకు ఎరచేశారు. స్త్రీలను మానభంగాలు చేశారు. క్యూలో నిలబడి ఒక స్త్రీని అనుభవించేవారు. చిత్రహింసకు గురై విలవిలలాడుతూ ప్రాణాలు వదిలేవారు. తిక్కా సైనికులు రాక్షసులైనారు. స్త్రీని భర్త ముందు, పిల్లల ముందు చెరిచి తుపాకీకున్న కత్తి కాళ్ళ మధ్య పొడిచి శరీరాలపై నడచి వెళ్ళేవారు. పాలిచ్చే తల్లుల చనుమొనలు కోసేవారు. పసిపాపలు నోరెండిపోయి, గుక్కెడు ప్రాణాలను వదిలారు. మానాభిమానాలు పోయి, మట్టిలో కలిసిపోయారు జానపదులు. మిగిలిన స్త్రీలను చెరపట్టి, తమ స్థావరాలలో వుంచి వాళ్ళకి కడుపులు చేశారు. బంగ్లాదేశ్‌లో బెంగాలీలు వుండకూడదు. వారికి పుట్టేది పాకిస్తానీలే.

## ఆ ర్ద్ర భూ మి

స్వతంత్ర భారతావనిని
పారిశ్రామికంగా వ్యావసాయికంగా పెంచాలని
కత్తీ సుత్తె కొడవలీ జోడెద్దులు ఢీకొంటే
పంట ఇంట పాతరై మూల్గింది.

తలలు పగలకొట్టుకొనే ఎడ్ల మగటిమలోంచి
అరుపులతో ఆవూ, దూకుళ్ళతో దూడ వస్తే
కతలతో కబుర్లతో కడుపు నిండింది.

గాదెలోంచి కాళీ హస్తం లేస్తే
మనిషి నాగలితో పొలం పోగా
భుజం చెక్క మలికి
రక్కుకొని ముక్కలయ్యాయి.

ఈ దూడ ఎద్దై, ఆ బలికున్న ఎద్దు తోడై
కాడికోసం వెదుకుతుంటే
మనిషి నాగలీ కత్తీతో సమీపిస్తే
ఆవుగోడు అడవిగోడు.

గోదై వవధ చేయక
మనిషి తినక పొలం పండక
ఇసుకరేణువులైన కోట్ల ప్రజల
ఎడారి ఆర్ద్రభూమి.

— కొలకలూరి

అలా ఆ జాతి ప్రజలను మలినం చేశారు. బంగ్లా బంధు ముజిబ్‌ను ఖైదీగా పాకిస్తాన్‌కు పట్టుకు పోయారు.

సరిహద్దు అడవుల్లో వుండి బంగ్లా గెరిల్లాలు పాకిస్తాన్ కావలా సైనికుల్ని అణగ్రదొక్కసాగారు. రైల్వే మార్గాలను చిందరవందర చేశారు. పాక్ సైనికులు రాకుండా వంతెనలను, రోడ్లను పడగొట్టారు. అలా పడగొట్టడంలో ఎందరో సైనికులు, సామాన్య ప్రజలు ప్రాణత్యాగాలు చేశారు. చిట్టగాంగ్ ఢక్కా రైల్వే మార్గాన్ని, ప్రసిద్ధ హార్డింజ వంతెనలు పడగొట్టారు. ముక్తిబాహినీ తాకిడికి పాకిస్తాన్ ప్రజలమీద తన కోపాన్ని, కక్షని తీర్చుకునేది. తల్లుల ఎదురుగా బిడ్డలను చంపేవారు. భార్యల ఎదురుగా భర్తలను అతిక్రూరంగా హింసించి చంపేవారు. వృద్ధుల ఎదుట తమ ఆడువారిని వస్త్రవిహీనుల్ని చేసేవారు. అలా చితికిపోయిన ప్రజలు ప్రాణాలను చేతపట్టుకొని తమ స్వదేశాన్ని, ఆత్మీయులను పోగొట్టుకున్నవారు పుట్టెడు దుఃఖంతో ఇండియ సరిహద్దుల్లోకి పారిపోయి రాసాగారు.

ఆ శరణాగతులను ఇండియా రెండు చేతులతో ఆదరించి ఆశ్రయమిచ్చింది. ప్రతిఒక్కరి వెనుక ఒక విషాదగాథ. రోజు వేలకువేలు రాసాగారు. ఇక్కడ వారికోసం, కొత్తరకము బాధలు దాచుకున్నాయి. ఆ వేలమందికి ఆశ్రమాలు, తృణ పటీరాలు ఏర్పాటు చేయవలసవచ్చేది. అవి చాలేవికావు చుట్టూ బురద, మట్టి పేలికలను ముఖంమీద కప్పుకొని పడుకునేవారు. ప్రాణం శరీరం చితికిపోయిన శరణాగతులు, వారి ఆహారం కోసం క్యూలో పదిగంటలు నిల్చుంటేకాని వారి ఎంతు వచ్చేదికాదు. పిల్లలు నలిగిపోయారు. ఆకలితో అనారోగ్యంతో, అంటువ్యాధులతో ఇండియా డాక్టర్లు వారిని చూచేలోపల చనిపోయి వుండేవారు.

హిందూదేశ ప్రజలు ధారాళంగా విరాళాలు ఇచ్చి వారిని ఆదుకోసాగారు. చేతనైనంతవరకు శ్రమిస్తూ, అదనపు పన్నులను పక్క దేశపు సోదర ప్రజల కొరకు ఆనందంగా మోసారు.

గొరిల్లా దళానికి, సైనిక శిక్షణ మన దళాలు ఇవ్వసాగాయి. బంగ్లా విముక్తికోసం, స్వతంత్రంకోసం, స్వతంత్రప్రియులైన హిందూదేశ ప్రజలు చేయూతనివ్వసాగాయి. వంగవీరులు చేతికి దొరికినదానితో దాడిని ప్రతిఘటిస్తూ ఆధునిక మారణాయుధాలకు ఎదనిచ్చి, స్వాతంత్ర్య వాంఛా ప్రపూరితులై ఎదుర్కొంటున్నారు.

ప్రపంచ సభ్య రాజ్యాలు చూస్తూ పూరుకున్నాయి. ఐక్యరాజ్య సమితి అత్యల్ప విషయం అన్నట్టు పట్టించుకోకుండా వుంది. కాని పొరుగు రాజ్యంలోని సైనిక నియంతృత్వంలో దుర్భరంగా ప్రాణహరణం, ప్రజాహననం జరుగుతుంటే మాస్తూ పూరకుండలేకపోయింది హిందూదేశం. పొరుగిల్లు కాలిపోతుంటే ఏ గృహస్థు పూరుకుంటాడు? ఇండియా గొంతెత్తి అరచింది. బంగ్లాదేశ్ సైన్యానికి ఆయుధాలను ఇవ్వసాగింది. అప్పటికి అగ్రరాజ్యాలలో

..లసం కలిగింది. సోవియట్ యూనియన్ బాహాటంగా పాకిస్తాన్ చర్యను నిరసించింది. ఆ ఘోరాన్ని ఆపమంది. అయినా శరణాగతులు వెల్లువలా ఇండియాకి రాసాగారు. భారతమాత అదనపు బరువుతో మూలిగింది. భారత ప్రజల్లో కోపం, అసహనం రగుల్కొంది.

*          *          *

పగలు రాత్రిని చూడాలని — రాత్రి పగటిని చూడాలని తొందరపడుతూ పరుగెత్తుతూనే వున్నాయి. గృహస్థు అంతర్ధానమైపోయాడు. శుభకార్యం చేయలేకపోయారు. వాసవి వివాహం మరో సంవత్సరానికి వాయిదా పడింది. అందాక ఇంట్లో కూర్చోవటం దేనికి యం. ఏ. లో చేరమని సలహా ఇచ్చాడు మోహన్.

''వెంటనే బయలుదేరిరా'' అని నళిని ఇచ్చిన టెలిగ్రాం చూసుకొని మరో మాట తలంచక రైలు ఎక్కింది వాసవి. వున్నట్టుండి నళిని ఎందుకు రమ్మంది? నాన్నగారు పోయారు. తను రావలసింది. ఎందుకు రాలేదు? ఇలాంటి ఆలోచనలతో వాసవి ప్రయాణమంతా ఆందోళనగా సాగిపోయింది. ఆ రైలుకి తాను వస్తున్నట్టు టెలిగ్రాం ఇచ్చింది. కనక స్టేషన్‌కి నళిని వస్తుందని తెలుసు. ప్లాట్‌ఫారమ్‌పై నళిని కోసం కళ్ళు వెతికాయి. ''వాసవీ!'' అంటూ పిలిచింది నళిని. పరుగెత్తి దాటిపోయిన రైలుపెట్టెను అందుకొంది. నళిని ప్రక్క అజయ్ వున్నాడు. నవ్వుతూ ''హలో!'' అని పలుకరించి సూట్‌కేస్, బెడ్డింగ్ క్రిందకి దించాడు. నళిని, అజయ్‌కి భుజాలవరకే వుంది. అందమైన జంట అని ముచ్చటపడింది. అరమరికలేని అజయ్ నిర్మలమైన నవ్వు చూసి మంచిమనిషి అని తలచింది. బహుకాలానికి కలుసుకున్న మిత్రులులా నళిని, వాసవి ఒకరినొకరు ఆప్యాయంగా చూసుకున్నారు. కౌగిలించుకున్నంత దగ్గరగా జరిగారు. ఆ ప్రియసఖిని చూడగానే అంతవరకు మనోగతమైన దుఃఖం పైకి వచ్చి, వాసవి కన్నులు కన్నీళ్లలో కలతబారిపోయినవి.

''వాసవీ! నేను రావాలనుకున్నాను. అజయ్ నాకు తెలియకుండ నీకు టెలిగ్రాం ఇచ్చాడు రమ్మని... తర్వాత ఆలోచిస్తే మంచిపని చేశాడను కున్నాను. ఇక్కడికి వస్తే ఈ పట్టణపు గజిబిజిలో, మన దుఃఖంకూడ గజిబిజి అయిపోతుందట. పైగా నిన్ను చూడాలన్న కోరిక ఈ విధంగా నెరవేరుతుందట.'' వాసవి చెయ్యి పట్టుకొని వత్తింది నళిని.

అజయ్ కళ్ళు చురుగ్గా, ప్రేమగా ఏదో కలలు కంటున్నట్టు నళిని వైపు చూస్తున్నాయి. 'అబ్బాయిగారు పూర్తిగా ప్రేమలో పడ్డాడు' అని తలుస్తూ, నళిని చెయ్యి బదులుగా వత్తింది. 'నాకు నచ్చాడు' అన్న సమాధానంగా.

''ఇక్కడ వుండిపోయేలా వున్నారు'' అంటూ ఒక చేత్తో సూట్‌కేసు, మరో చేత్తో హోల్డాలు అవలీలగా పట్టుకొని బయలుదేరాడు.

''అయ్యో కూలీని పిలుద్దాం. మీకెందుకు శ్రమ'' అంటూ వెనకబడింది వాసవి.

నళిని నవ్వుతూ, ''పోనీవే. అంత ఇష్టమైతే తీసుకురానీ. అరిగిపోడులే'' అంది. కసరత్తు చేసే మనిషిలా చురుగ్గా, తేలిగ్గా పోతున్న అజయ్‌ని అందుకోలేకపోయారు. వీరు బయటికి పోయేటప్పటికి ఆటోరిక్షాలో సామాను పెట్టి వీరికోసం చూస్తున్నాడు. తను తలంచినట్లే వుంది అనుకున్నాడు. ఆ మనస్విని ఒకే ఎత్తులో ఒకే లావులో వున్నారు మాట్లాడుకుంటూ మదాలసగా వస్తున్నారు. అజయ్ కళ్ళన్నీ నళిని మీదనే కేంద్రీకరించి వున్నాయి.

''ముందు ఆల్‌వాల్‌కి పోదాం. సాయంత్రం అమ్మని చూడ్డానికి వెళ్ళవచ్చు. ఏమంటావు?'' అంది నళిని.

''అలాగే'' అంటూ ఆటోలో ఎక్కింది వాసవి.

నళిని ఎక్కుతూ ''మరి వస్తా. మీ శ్రమకు థాంక్స్'' అంది అజయ్‌తో.

''ఒకే. మీ ప్రోగ్రాం ఏమిటి'' అని అజయ్ అడిగాడు. ఆ మాటతో వాసవికి నాన్న జ్ఞాపకం వచ్చారు. హృదయం బరువెక్కిపోయింది. ముఖం మ్లానమైంది.

''ప్రోగ్రామ్సుకి తొందరేమిటి? దీర్ఘమైన దినాలు మా ముందుండగ ... బై య్'' నళిని — ఆటో కదిలించిచూడగా వాసవి నమస్కారం చేసింది.

## త్వరలో
## ప్రేమ పాశం
## కొత్త సీరియల్

''ఎందుకు నమస్కారం చేస్తావ్? ఎన్నిసార్లు చేస్తావు? అటు చూడు మన వెనకే వస్తాడు. అంత తేలిగ్గా వదలడు'' అంటూ పకపక నవ్వింది. ఆ నవ్వులో మమకారం, గర్వం మిళితమై వినిపించాయి.

''అంతగా ప్రేమిస్తున్నావా?'' అని వాసవి అడిగింది.

''నీవు బావని ప్రేమిస్తున్నంతగా.''

''నేను పుట్టినప్పటినుంచి బావ నాకు తెలుసు. ఆ ఉత్సాహంతో పెరిగాను...''

''అజయ్ నాకు ఎన్నో జన్మలనుంచి తెలిసినట్టుగా వుంది. వాసవి! ... భావాలు భాషలో పెట్టలేను. ఆ ఫీలింగ్ వ్యక్తంచేయలేనిది. ప్రేమలో యింత మాధుర్యం వుందని నాకెప్పుడూ నీవు చెప్పలేదు...''

''చెప్పితే అర్థమయ్యేదికాదుకాని ఈ ప్రేమ ఏ ప్రమాదానికి దారితీయదుకదా? రెండువైపుల లైను క్లియరేనా?''

మమతగా వాసవి వైపు చూస్తూ ''వాసవీ! నీవు అన్నీ ప్రాక్టికల్‌గా ఆలోచిస్తావు. నీఅంతగా ఆలోచించటానికి సమయంలేదు. అందాక మనస్సు ఆగనంది. అజయ్‌కి అర్పితమైపోయింది.''

వాసవి మారుమాట్లాడకపోవటం చూసి, ''అజయ్‌ను చూశావు. అంతే, అతనితో మాట్లాడి పరిచయం ఏర్పడితే నీకు తెలుస్తుంది.''

''అజయ్ మంచితనం గురించి కాదు. మీ పెళ్లికి అమ్మవాళ్ళు, అటు వారివాళ్ళు అంగీకరించే పరిస్థితులు వున్నాయా లేదా అని.''

నళిని అతిహాసితా చేసింది. ''ఇంకా మొదటి దశలోనే వున్నాం. పెళ్లిదాకా ఆలోచించలేదు... ఈకాలంలో ఒకరినొకరు ఇష్టమైతేచాలు. తక్కినవి పెద్ద ఆటంకాలు కావు. అజయ్ స్వతంత్రుడు. భార్యాపిల్లల్ని పోషించుకోగలడను కుంటాను...''

''సూర్యరశ్మికి నీళ్ల ఆవిరైపోవటం చూడలేం. అలాంటిదే ప్రేమ. ఎప్పుడు ఎక్కడ మొదలవుతుందో చెప్పలేము. మబ్బులాంటి ప్రేమ గుండెల్లో గూడుకట్టుకొనిపోయివుంటుంది.''

''ప్రేమలో కవిత్వం కూడ వస్తుందే'' అంటూ వాసవి నవ్వింది.

హారన్ వినిపించింది. నళిని అజయ్‌ని వెక్కిరించింది. అలా వెక్కిరిస్తున్న నళినికి కన్నుగీటాడు. కళ్ళు విప్పారించి చూస్తుంటే అజయ్ నోరంతావిప్పి నవ్వాడు. చటుక్కున తల లోపలికి తీసుకొని, ''వాసవి, అజయ్ తుంటరి. అన్నీ పోకిరివేషాలు. బావగారిలా పెద్దమనిషికాదు'' అంది.

బావ మోహన్ తలపులతో హృదయం నిండిపోయింది. ''చిన్నపిల్లాడిలా ఏడ్చాడు. అన్నయ్యలకంటే బావే ఎక్కువ దుఃఖించింది'' అని నళినికి చెప్పింది.

నాన్నగారిమీద నుంచి వాసవి మనసు మళ్ళించటానికి ప్రయత్నించింది నళిని.

ఆటో ఆగింది. ప్రక్క ఒక అంగడిముందు తండ్రి కాబోలు పదేళ్ళ కొడుకుని చావబాదుతూ, ఆ దెబ్బలకి ఏడుస్తుంటే, ''ఏడుస్తావా? నోర్ముయ్!'' అని మరొకటి తగిలిస్తున్నాడు. రోడ్డున పోయేవాళ్ళు ఆ వింతను చూస్తున్నారు.

''ఆ తండ్రి ఎవరో ఇంద్రుడిలా వున్నాడు. 'అదితి' కడుపులోకి యోగమాయతో దూరి శిశువును వజ్రాయుధంతో ముక్కలు ముక్కలుగా నరుకుతుంటే ఆ శిశువు ఏడుస్తుంటే మారుదం, మారుదం (ఏడవకు) అంటూ చంపజూశాడు. ఆ పెద్దమనిషిని చింతబరికతో కొట్టితే ఏమంటాడో!'' వాసవి అది వూహించుకుంటూ నవ్వుతూ,

''పెద్దవాళ్లు ఒకోసారి రాక్షసుల్లా ప్రవర్తిస్తారు ఆ చిన్నవాడికి బలం వుంటే అక్కడ నిల్చుంటాడా?''

ఆటో ఇంటిముందుకు వచ్చింది. నళిని కళ్ళు మూసుకుని అజయ్‌ని వెక్కిరించి ఇంట్లోకి పరుగెత్తింది. ఓ పది నిమిషాల తర్వాత తన గది బాల్కనీలోకి వచ్చి నిల్చుని ''వాసవీ! ఇక్కడ కూర్చుంటే పొద్దుపోతుంది. మనమెక్కడికి పోనక్కరలేదు.'' అంటూ ప్రక్క ముఖర్జీ ఇంటి వైపు చూసింది. కటకటాల వెనుక నిల్చున్న అజయ్ మాటలాపి చూస్తున్న నళినిని కన్నుగీటి క్రిందికి వెళ్ళాడు. నళిని కోపంగా పెదాలు ముడిచింది.

[ఇంకా వుంది]

(గత సంచిక తరువాయి)


అనేక రాజన్యులయు భూసురులయు సమక్షంబున దుర్యోధనుడు వైష్ణవ యజ్ఞము వైభవోపేతముగ జేసెను..


మహారాజా! వైష్ణవ యజ్ఞంబు నిర్విఘ్నముగ నెరవేరినది.. ఇక ఆ పాండవుల నిర్జించి రాజసూయం చెయ్యవలసి ఉంది. అది అసాధ్యము అనుకోవద్దు ఆ అర్జునుని అంతమొందించే పర్యంతము పాదప్రక్షాళనము చేయను..
కర్ణా! నీయండ నాకుండగ ఆ పాండవులన నెంతవారు.


ద్వైత వనంబున ఒకనాటి రాత్రి ధర్మరాజు నిద్రించుచుండగ ... కలలో.......
ధర్మాత్మా! మేము వనచరంబులము. నిత్యము మీచే జంపబడి బీజమాత్రము మిగిలి యున్నాము... మాపైకరుణజూపి మీరు మరొక అరణ్యమునకు పోయి ఇక్కడ మా వంశ వృద్ధికి తోడ్పడ ప్రార్థన.


సోదరా! ఈ ద్వైత వనమునకు వచ్చి సంవత్సరముపై ఎనిమిది మాసములు అయినది. ఇంక మనము మరియొక తావునకు తరలుట మంచిది...


పాండవులు కామ్యక వనంబునకు వచ్చి నివాసంబు లేర్పరచుకొని శాక,ఫలమూలంబులందేసె దేహయాత్ర నడుపుచు తాము పడిన పాట్లు తలంచుకొని,క్రోధ,శోకంబుల తమలోనుపశమించుకొనుచు కాలము వెళ్ళబుచ్చుచుండిరి.


పదకొండు సంవత్సరముల అరణ్యవాసము అంతమయినది... అంత...
అన్నయ్యా! అదె చూడు వ్యాసమహర్షులు వస్తున్నారు


ధర్మరాజు అనుజ సహితముగ ఎదురు వెళ్ళి వ్యాసుని తోడ్కొని వచ్చి విశేషార్చనలం బూజించెను.


ధర్మరాజా! కాలగతి ననుసరించి సుఖదుఃఖములు వచ్చుచుండును వానికి వశుడు గాక,క్షమయు అహింసయు, సత్యము, సమతయునింద్రియ జయము, మున్నగు తపోలక్షణముల నలవర్చుకొని నరుడు సుగతులు పొందును... ఇక్కడ చేసిన పుణ్యంబు ఇక్కడనే మేలు చేకూర్చునుపైగా మీది జన్మంబునకు మేలు చేయును. కాన మనుజుడు తపఃశక్తికి తోడు ధర్మాచరణోపకారంబులు చేయవలయు.
మహాత్మా! దానము, తపంబు వీనిలో ఏది కష్టసాధ్యంబు? అధిక ఫలంబిచ్చునది ఏది?
[ఇంకా ఉంది]

## విశేషాలు "మండే గుండె..." చిత్రంలో లత ధ్యాస

తెలుగు లెక్చరర్ రాధాకుమారి "అప్పుడు రాక్షసుడు 'విష్ణుగుప్తా, లొంగిపోయితిని. ఎట్టి కార్యమునకైనను అంగీకరించవలెను. మిత్ర స్నేహమునకు నే దల వ్రాల్చెదను' అని అన్నాడు. అది విన్న చాణక్యుడు తన పన్నాగం ఫలిస్తోందన్న సంతోషంతో చంద్రగుప్తుడితో ఇలా అన్నాడు: 'వృషల ! అమాత్య రాక్షసులవారు శస్త్రగ్రహణము నొనరించి యనుగ్రహింపగా,'" అంటూ ఆగి, లత వంక చూసింది. లత (జయప్రద), పక్కనున్న స్టూడెంటు కాగితంమీద గీతలు గీసి, చుక్కలాట ఆడుకుంటున్నారు. "లతా!" అని అరిచింది లెక్చరర్. "శస్త్రగ్రహణము – అంటే ఏమిటి ?"

లత ఉలిక్కిపడి లేచి నిలబడింది. "పెళ్ళి, మేడం..."

"క్లాసు రూమ్‌లోనూ పెళ్ళి ధ్యాసేనా ? పాణిగ్రహణం – అంటే పెళ్ళమ్మా. ఏ గ్రహణం అన్నా 'పెళ్ళి' అని కాదు. అసలు నువ్వు సరిగ్గా పాఠం వింటున్నావా ? చంద్రగుప్తుడెవరు ?"

"ఎన్. టి. రామారావు, మేడం .. చాణక్యుడు అక్కినేని, రాక్షసుడు సత్యనారాయణ -- శ్రీ రామకృష్ణా సినీ స్టూడియోస్' వారి చాణక్య–చంద్రగుప్త'లో..."

లత జవాబుకు మిగతా విద్యార్థులంతా గొల్లున నవ్వారు. లెక్చరర్ నీరసించిపోయి, "అయ్యో, రాత ! ఈ కాలం పిల్లలకు ఈ రెండింటి మీదే ధ్యాస – పెళ్ళి, సినిమాలు... అలాగేనమ్మా, మీకదే అర్థమవుతుందంటే–ఇకనుంచీ 'రామారావ్ ఇలా అన్నాడు. సత్యనారాయణ పద్యం పాడాడు' అనే చెప్తాను. అసలు చదువుమీద శ్రద్ధలేనివాళ్ళు కాలేజీకి ఎందుకొస్తారమ్మా ?"

"అటెండెన్స్ కోసం ! మేడం !"

మళ్ళీ నవ్వులతో క్లాసంతా మార్మోగింది. ఇంతలో ప్యూన్ ఓ కాగితం తెచ్చిచ్చాడు. అది చదివి లెక్చరర్ "లతా, నిన్ను ప్రిన్సిపాల్‌గారు రమ్మంటున్నారట. ఆవిడ దగ్గరా ఇలాగే రామారావ్, నాగేశ్వరరావ్ – అనకు," అంది.

"అలాగే, మేడం ! 'ఎన్. టి. నాగేశ్వరరావ్, అక్కినేని రామారావ్' అంటాను," అంటూ లత ప్యూన్ వెంట బయలుదేరేసరికి క్లాసులో మళ్ళీ నవ్వులు...

జయప్రద–కృష్ణ, జయసుధ–శోభన్‌బాబు, మాధవి–చంద్రమోహన్ జంటలతో కె. బాపయ్య దర్శకత్వంలో డి. రామానాయుడు నిర్మించే సురేష్ మూవీస్ "మండే గుండెలు" చిత్రం విడుదలకు సిద్ధమవుతోంది.





'మండే గుండెలు'లో కృష్ణ, జయప్రద



'సన్నాయి అప్పన్న' ప్రారంభోత్సవ దృశ్యం

## సినిమా

### అపర్ణ కంబైన్స్

''ఆశాదీపాలు'' అనే వర్ణ చిత్రాన్ని ...కె. పి. రెడ్డి కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో సంగీత దర్శకుడు రాంజీ నిర్మిస్తున్నారు. జయంతి, ప్రభాకరరెడ్డి, శుభ, సత్యేంద్రకుమార్, అల్లురామలింగయ్య, బేబీ రోహిణి, మాస్టర్ హరి, మాస్టర్ సునీల్‌కుమార్, కల్పనారాయ్, సాక్షి రంగారావు, శ్రీరాం, జయమాలిని పాత్రధారులు. గీతాలను సి నారాయణరెడ్డి, గోపి రాశారు. పి. సాయిప్రసాద్ ఛాయాగ్రాహకుడు. శిల్పం, కూర్పులను కోటకార్, కె. బాలు నిర్వహిస్తున్నారు,

### తమాషా ట్రెయిలర్

''అప్నా పాన్'' హిందీ చిత్రం ట్రెయిలర్‌కు నిర్మాత జె. ఓంప్రకాష్ ఓ గమ్మత్తు చేశాడు. ప్రారంభంలో కొన్ని ఫైట్లు తెరమీద కనిపిస్తాయి. కొన్ని క్షణాల తర్వాత అవి అదృశ్యమై, ధర్మేంద్ర కనిపిస్తాడు. ''పొరబాటున కేబిన్‌లోని ఆపరేటర్ ఇంకేదో సినిమా తాలూకు రీల్ వేశాడు. 'అప్నాపాన్' స్టంట్లులాంటి మసాలా లేని కుటుంబగాథా చిత్రం,'' అని ప్రకటిస్తాడు ధర్మేంద్ర. ఇంతకీ, ఈ చిత్రంలో ప్రధాన పాత్రధారి సంజీవ్ కుమార్.

### ఆగస్ట్ 17 న గంధర్వకన్య

ప్రభ, నరసింహరాజు ప్రధాన పాత్రలు నిర్వహించిన విఠల్ ప్రొడక్షన్స్ ''గంధర్వకన్య'' వర్ణ చిత్రాన్ని ఆగస్ట్ 17 న విడుదల చేస్తున్నట్లు తెలియజేశారు దర్శక నిర్మాత బి. విఠలాచార్య. జి. కె. మూర్తి, కర్పూరపు ఆంజనేయులు రచన, విజయాకృష్ణమూర్తి సంగీతం, హెచ్. ఎస్. వేణు ఛాయ, గోఖలే శిల్పం, తెర వెనుక హంగులు.

# మంచుకొండల మధ్య భూకంపాల మీద అద్భుతమైన రైలు మార్గం "బామ్"

**ఈ శతాబ్దపు వింత "బామ్"**

**బైకాల్ – అమూర్ రైలు మార్గాన్ని ఈ శతాబ్దపు ప్రపంచ వింతగా పేర్కొన**



రైలు మార్గంపైన వంతెనలు దించుతున్న దృశ్యం

**వచ్చు. "బామ్" అనే పేరుతో ప్రసిద్ధి కెక్కిన దీని పొడవు 3200 కిలోమీటర్లు. సైబీరియాలోని మారుమూల ప్రాంతాలను పసిఫిక్‌తో ఈ రైలు మార్గం కలుపుతుంది**

1974 లో ప్రారంభం అయిన ఈ మార్గం 1983 కి పూర్తి అవుతుంది. ప్రపంచంలోకెల్లా పొడవైన రైలు మార్గం అయిన దీనిపై 8 నుంచి పదివేల టన్నుల బరువైన రైళ్ళు ప్రయాణం చేస్తాయి.

## దీనదాలు !

ఈ శతాబ్దం ప్రారంభంలో నిర్మించిన ట్రాన్స్ సైబీరియన్ రైలు మార్గానికి ఉత్తరంగా 180 నుంచి 600 కిలోమీటర్ల దూరంలో "బామ్"ని నిర్మిస్తున్నారు. ఈ రైలు మార్గం పొడవునా 11 పెద్దనదులు, వందకు పైగా చిన్ననదులు పరవళ్ళు త్రొక్కుతుంటాయి. చలికాలంలో మైనస్ 60 డిగ్రీల సెంటీగ్రేడు, వేసవిలో ప్లస్ 40 డిగ్రీల సెంటీగ్రేడు శీతోష్ణ స్థితులతో, ధృవప్రాంతాలను పోలిన మంచు దిబ్బలతో, మహాపర్వతాలతో దుర్భర వాతావరణం నెలకొనివుంటుంది.



మంచు కొండలమధ్యనుంచి యమాతియా చేసే రైలు

## రోజూ భూకంపాలే !

ప్రతి మూడుగంటల కొకసారి భూమి కంపిస్తూ వుంటుంది. గత రెండు దశాబ్దాలలో ఆరుసార్లు తీవ్ర భూకంపాలు సంభవించాయి. శిలాపాతాలకూ బురద ప్రవాహాలకూ పెట్టింది పేరు. అలాంటి ఈ ప్రాంతంలో సంవత్సరమంతటా నిర్మాణ కార్యక్రమాలు నిరంతరంగా జరగటం చెప్పుకోదగ్గ విశేషం.

ఈ రైలు మార్గంలో దాదాపు సగం పర్వతాలను తొలిచి సొరంగమార్గం నిర్మించాల్సి వుంటుంది. అందులో ఒకదాని పొడవు 15 కిలోమీటర్లు. చాలా భాగం లోయలు, ఒత్తిడిభూములగుండా ప్రయాణం చేస్తుంది కాబట్టి చాలా ఎత్తయిన కట్టలను నిర్మించారు.

## కొత్త నగరాలు

బామ్ రైలు మార్గం వల్ల ఎన్నో కొత్త నగరాలు, విద్యుత్ కేంద్రాలు, పారిశ్రామిక కర్మాగారాలు నిర్మింపబడుతున్నాయి. దీని నిర్మాణంలో ఎదురయ్యే సమస్యల్ని పరిష్కరించడానికి 300 లకు పైగా పరిశోధనా సంస్థలు పనిచేస్తున్నాయి. ఈ మార్గంలో మరో తొమ్మిది మహానగరాలు వెలుస్తాయి.

ఒకనాటి మరుభూమి అయిన సైబీరియా 2 వేల సంవత్సరం నాటికి శక్తివంతమైన పారిశ్రామిక వాటికగా వెల్లివిరుస్తుంది.

## ప్రత్యేక సదుపాయాలు

"బామ్" నిర్మాణంలో పాల్గొంటున్నవారిలో డెబ్బయిశాతం యువజనులు. మొత్తం ఒక లక్ష ఇరవై వేల మంది పని చేస్తున్నారు. దుర్భర వాతావరణ పరిస్థితులదృష్ట్యా పనివారందరికీ ప్రత్యేక సదుపాయాలు కల్పించారు. వారికీ, వారి పిల్లలకూ అవసరమైన ప్రత్యేక గృహాలు, షాపులు, ఆస్పత్రులు, పాఠశాలలు, క్రెచీలు, కిండర్‌గార్డెన్‌లు నెలకొల్పబడ్డాయి.

సైబీరియా ఆర్థికాభివృద్ధిని, సోవియట్ యూనియన్‌లోని రైల్వే రవాణాను గణనీయంగా పెంపొందించే ఈ రెండవ ట్రాన్స్ సైబీరియన్ రైలు మార్గం నిర్మాణంవల్ల జపాన్, పశ్చిమ యూరప్ దేశాల మధ్య కంటైనర్ రైల్వే సర్వీసు చెప్పుకోదగినంతగా పెరుగుతుంది.

[సో. వా. సం.] ★



బైకాల్ – అమూర్‌ల మధ్య నిర్మింపబడ్డ రైలుమార్గ భాగం



# ముష్టిచెట్టు

ఎబివి నరసింహారావు

**కుండలు చెయ్యడానికి మట్టిని తొక్కుతున్న గవరయ్య కొడుకు మాటలు విని నిశ్చేష్టుడయ్యాడు రోటిలో జొన్నలు తొక్కుతున్న సీతమ్మ కొడుకు మాటలు విని కొయ్యబారిపోయింది ఆమె చేతిలో రోకలి మరి కదలలేదు. ఆ క్షణంలో భరించలేని నిశ్శబ్దం అక్కడ ఆవరించింది**

క్షణాలు దొర్లిపోయాయి. సీతమ్మ తేరుకొని చేతిలో రోకలిని గోడకు ఆనించింది.

"మనవంతా కుండలు సేసుకొనే బతికాంరా... నీ తాత, ముత్తాత, ఇంకా ఆళ్ళ పెద్దోళ్ళంతా ఈ కుండలు చేసుకొనే బతికార్రా – ఇయ్యాల పట్నంలో ఇంగిలీసు సదువు సదువుతున్నావని మీ అయ్య కుండలు సెయ్యడం మానుకోవాలా? పట్నానికొచ్చి కుండల బేరం సెయ్యడం మానుకోవాలా? – సివరకు ఇట్టా తయారైనా వేందిరా?" – సీతమ్మ గొంతులో మందలింపుకన్నా ఆవేదన ఎక్కువగా ధ్వనించింది.

బుగ్గలు నొక్కుకుంటూ చోద్యంగా అడుగుతున్న తల్లివేపు చూడలేక తల దించుకొన్నాడు వెంకటేశు. మళ్ళీ నిశ్శబ్దం రాజ్యంచేసింది కొంతసేపు.

"ఈ కుండలు అమ్ముకొనే మనం కట్టుకింది కయ్య కొన్నాంరా! – ఇయ్యే మనకు ఈ గూడును నిలబెట్టాయి. ఇప్పుడు నీకియి పనికిరాకుండా పోయాయి!... అయినా నీకు పెద్ద సదువులు సదివించొద్దంటే ఇన్నాడా మీ అయ్య? – ఇప్పుడు నీకు ఈ కుండలూ పనికిరాకుండాపొయ్యాయి. ఆటిని సేసుకొనే అమ్మా, అయ్యా కూడా పనికిరాకుండాపొయ్యారు. ఆటి డబ్బు మాత్రం పనికొత్తాది." – ఈసారి సీతమ్మ కంఠంలో ఆగ్రహం ధ్వనించింది.

"కుండలు – కుండలు కుండలు – వెధవ కుండలు – ఇవి మనకు మేడలిచ్చాయా – మిద్దెలిచ్చాయా? అయినా ఇవన్నీ నాకనవసరం. ఆడికి అయ్య బండిమీద కుండలేసుకొనివచ్చి అమ్ముతావుంటే నాకు తల కొట్టేసినట్టున్నాది. నా స్నేహితులంతా ఎగతాళిచేస్తున్నారు..." ఉక్రోషంగా అన్నాడు వెంకటేశు.

"కుండలుకాక ఏం సెయ్యమంటావురా – ఉద్యోగాలు సెయ్యమంటావా – ఊళ్ళేలమంటావా మీ అయ్యని? – కుండలు ఏసకపోయి పట్నంలో అమ్మితే అవమానమా? తల కొట్టేసినట్టుందా నీకు? మరి ఆటిని సేసి అమ్ముకోకపోతే ఏం తింటావు బువ్వ? నువ్వు సదుంకుని గొప్పోడివై ఉద్యోగం సేసేటప్పుడు ఇయ్యి సెయ్యడం మానేత్తాలేంరా." – సీతమ్మ ధిక్కరించింది.

"ఎందుకులేయే ఆడితో కుర్రసన్నాసి తెలిసీ తెలీక వాగుతాడు. ఈపాలి పట్నంపోకుండా ఈ పక్క వూరి సంతకు పోతాలే – ఆడికీ సిగ్గుగా వుండదు." గవరయ్య మెల్లిగానే అన్నా అతని కంఠం ఎందుకో వణికినట్లయింది.

"ఓసోస్ – ఎవకేసుకొస్తుండాడయ్యా ఇంతోటి కొడుకుని ఇట్టా సేసే ఆడ. ఈగతికి వొచ్చాడు. పట్నం బళ్ళో అచ్చెర ముక్కలేం వొచ్చాయో తెల్దాయిరి. ఇటు కులవు ఇద్దె నేర్చుకోకపోయె – మట్టిలో కాలెట్టడం నేర్వకుండా ఇంతోణ్ణి చేస్తివి. ఇయ్యాల ఆడికి ఈ కుండలు పనికిరాకుండాపోయాయి. రేపు మనవే పనికిరాకుండాపోతాం." సీతమ్మ విసురుగా జొన్నలు తొక్కడం ప్రారంభించింది.

గవరయ్య కాళ్ళు మట్టిలో కదిలాయి వెంకటేశు విసురుగాలేచి బయటకు వెళ్ళిపోయాడు. దూరంగా వెళ్తున్న కొడుకును పడిపోయిన పెరటిగోడమీదనుంచి చూసి నిట్టూర్చాడు గవరయ్య.

* * *

"ఏందిరా గవిరిగా! – ఎంకటేశు పదో కళాసు తప్పాడంటగా – ఆడికి సదువు ఒంటబట్టినట్టులేదు" – నోట్లో చుట్ట తీసి పుప్పుక్కున

# లక్మే వ్యానిషింగ్ క్రీమ్‌తో 'నిన్ను ప్రేమిస్తున్నాను' అని గుసగుసలాడే చర్మం

లక్మే వ్యానిషింగ్ క్రీమ్. ఇది మేకప్‌కు, పౌడర్ బేస్‌కు ఎంతో చక్కనిది. మీ ముఖంపై సున్నితంగా... రక్షణనిచ్చే అనురాగ స్పర్శలా...ఏ వాతావరణంలోనైన సరే...ఎప్పుడైనా సరే...మీ రూపం అందంగా, తాజాగా, దోషరహితంగా రూపొందేందుకు.




**లక్మే వ్యానిషింగ్ క్రీమ్‌తో**

చర్మ రక్షణ గురించి తెలిసినవారు

లక్మే

daCunha/L-VC/LT/4 TL

మ్మేసి అన్నాడు మునసబు పడకకుర్చీలో బరువుగా కదులుతూ.

మునసబు మాటలకు గవరయ్య ఏమీ మాట్లాడలేదు. ఎడ్లముందు గడ్డిపడేసి వాటిని చూస్తూ ఉండిపోయాడు మౌనంగా.

"పోన్లే తప్పితే తప్పాదులే – దిగులుపడువాక. ఆడు పాసైతేమాత్రం చేసేది ఏముంది? మహా: ఎమ్మేలు, బియ్యేలు సదివినోళ్ళే చేతులూపుకుంటూ తిరుగుతా ఉండారు ఉద్యోగాల్లేక. మన రైసుమిల్లుకు పంపించు–లెక్కలు రాయడానికైనా పనికొస్తాడేమో" – మునసబు అన్నాడు.

గవరయ్య ఇంకా మౌనంగా ఉండడం చూసి, "సీతాలు చెప్పిందిలేరా – ఆడు పెయిలయ్యాడని ఒకటేమైన బాధపడిపోతన్నావంటగా–పర్లేదులే– ఇంకా చిన్నోడేకదా – మన దగ్గర కాస్త పని నేర్చుకుంటే..." నోట్లో చుట్ట గుండ్రంగా తిప్పుతూ అన్నాడు మునసబు.

"ఇన్నేళ్ళు కట్టపడ్డాను – కుండలమ్మి, తవరిచ్చిన జీతం పెట్టి ఆడిని ఈడదాకా

సామెతల కథలు

# అష్టావధానం

పద్మావతి గంగాధర్

ఒకేసారి అనేక విషయాలను గురించి ఆలోచిస్తున్నా, ఒకేసారి ఒకరికంటే ఎక్కువమందికి సమాధానాలు చెబుతున్నా యీ పలుకుబడిని ఉపయోగిస్తారు. ఒక్కొక్కసారి ఎవరైనా వంటరిగా కూర్చొని దీర్ఘంగా ఆలోచిస్తున్నా, వెటకారంగాకూడ, ''ఏమిటిరా అష్టావధానం చేస్తున్నావు'' అంటుంటాం.

అష్టావధానం ఒక సాహిత్య ప్రక్రియ. ఒకేసారి ఎనిమిది సమస్యలను గురించి ఆలోచించటం, ఆ సమస్యలను పూరించటం, అష్టావధానంలో ప్రధాన భాగం.

ఈ గొప్ప ప్రక్రియ, ఒక్క తెలుగు భాషకి మట్టుకే పరిమితమైనదని చెప్పవచ్చు. తెలుగు భాషాభిమానులు గర్వించవల్సిన విషయం కూడాను. శతావధానాలు కూడా వున్నాయి. చేసిన తెలుగు పండితులూ వున్నారు.

అవధానాన్ని చేసే పండితుణ్ని అవధాని అంటారు. అవధానిని ప్రశ్నించే ఎనిమిదిమందిని పృచ్ఛకులు అంటారు. ఈ ఎనిమిదిమంది పృచ్ఛకులూ సమస్యలు అవధానికి యిస్తారు. వాటిని అతడు పూరించాలి. సమాధానాలు పద్యరూపంలో చెప్పాలి.




పృచ్ఛకులు న్యస్తాక్షరీ, ఆశు కవిత్వం, వర్ణన, దత్తపది, సమస్య, అప్రస్తుత ప్రసంగం, నిషిద్ధాక్షరీ, గంటలూ, నిర్వహిస్తారు.

అవధాని, ప్రతి పృచ్ఛకునికి సమాధానం, పద్యరూపంలోనే చెప్పాలి కాబట్టి, ఒక్కొక్కరికి సమాధానంగా ఒక్కొక్కరికీ, ఒక్కొక్క చరణంలో చెబుతాడు. అలా నాల్గుసార్లు, నాల్గు చరణాలూ చెబుతాడు సమాధానం పూర్తి అవుతుంది. పద్యం చందోబద్ధంగా కూడా వుండాలి.

అవధాని, సమాధానం చెప్పటానికి, ఆలోచనా నిమగ్నుడై వున్నప్పుడు, అతడ్ని తప్పుదోవను పట్టించటానికీ, సమస్యను ఆలోచించకుండా చేయటానికీ, అప్రస్తుత ప్రసంగం నిర్వహించే పృచ్ఛకుడు, అప్రస్తుత ప్రశ్నలు వేస్తూంటాడు. అతడికి సమాధానం, చమత్కార మార్గంలోనే చెప్పాలి అవధాని. అతడలా సతమవుతూంటే, గంటలు కొడుతూంటాడు మరొక పృచ్ఛకుడు. అవధాని పానకంలో పుడకలాంటి అప్రస్తుత పృచ్ఛకునితో తట్టుకుంటూ, కొట్టే గంటలను కూడ గుర్తుపెట్టుకోవాలి.

ఒక్కొక్క చరణాన్ని చంధోబద్ధంగా చెప్పటమేగాక, నాల్గు వరసల తరువాత, పూర్తి పద్యాన్ని కూడ చెప్పి, ప్రతిపృచ్ఛకుని సమస్యలనూ పూరిస్తాడు. కార్యక్రమము చివరవరకూ గంటలెన్ని కొట్టిందీ ఖచ్చితంగా చెబుతాడు. అంతటితో అష్టావధానం పూర్తవుతుంది.

అవధాని ఎంత కష్టపడతాడో, అష్టావధానాన్ని స్వయంగా చూస్తేనే తెలుస్తుంది. ఇక శతావధానాన్ని గురించి చెప్పనవసరంలేదు.

చదివించాను. నుదుటి రాత బాగాలేక తప్పాడు. ఈ కళాసు పాసు సేయించాక — ఆనక ఉద్యోగం సేత్తే బాగుంటాది — లేకపోతే పెయిలయ్యాననే ఆడుకీ మనసు పీకుతుంటాది దొరా!''

గవరయ్య మాటలు విని అప్రతిభుడైనాడు మునసబు. చాలాసేపు ఆయన ఏమీ మాట్లాడ లేదు.

''సరే — నీ ఇష్టం. సీతాలు మరీ మరీ బతిమిలాడితే కాదనలేక అన్నాను.''

మునసబు గుర్రుగా అన్నాడు.

గవరయ్య గట్టిగా నిట్టూర్చాడు.

*           *           *

'ఏరా ఏలెడు లేవు — పదో కళాసు పదిసార్లు సదివినా పాసుకాలేని ఎదవ్వి తాగుడు కావాల్సొచ్చిందంట్రా? — ఏనాడైనా నీ అయ్య తాగడం సూసినావంట్రా? — పగలనక, రెయ్యనక రెక్కలు ముక్కలు సేసుకొని, కుండలు సేసి సంపాదించి పంపుతావుంటే సోకైన గుడ్డలేసుకొని సీమ సారాయి తాగుతావా? — అదేందిరా అని అడిగితే అయ్యమీద సెయ్యి సేసుకొంటావంట్రా నువ్వు? పట్నం వొచ్చి కుండలు అమ్మితే అవమానమని అఘోరించినోడివి తాగి తందనాలాడితే అవమానంగా లేదురా — సేగితుల ముందర కన్నతండ్రి పైన తిరగబడితే అవమానంగా లేదంట్రా నీకు — ఇదేరా నువ్వు నేర్చిన సదువు — ఇదేనంట్రా నీకు ఇన్నేళ్ళనుంచి పట్నం బళ్ళో సెప్పిన సదువు? గునం, మంచి — సెడు సెప్పని సదువులెందుకురా నీకు? అదేది సెప్పని ఈ పుత్తకాలెందుకురా — తగలెయ్యను. సదు సైకుంటా — బుద్ధిలోకి వొస్తావు — మమ్మల్ని వుద్ధరిస్తావు అని ఆశపడ్డామే కాని ఇంత బష్టుడవుతావనుకోలేదురా — ముష్టి చెట్టుకు నీళ్ళు పోసినందుకు మాకు కావలసిందే ఈ శాస్తి — పో అవతలకి'' — సీతమ్మ భద్రకాళిలా లేచింది. ఆమె కేకలు విని బెదరిపోయాడు వెంకటేశు. ఎదురుగా షెల్ఫుమీద ఉన్న పుస్తకాలను తన్ని పొయ్యిలోకి విసిరేస్తూంటే తల వంచుకొన్నాడు వెంకటేశు.

ఆ పుస్తకాలు అతని మెదడులో ఏమి జ్ఞానాన్ని నింపాయో కాని, పొయ్యిలో మండిపోతూ అతని మొహంమీద ఎర్రని రంగును మాత్రం పులిమాయి. కాలిపోతున్న పుస్తకాలను చూసి కళ్ళు వత్తుకున్నాడు గవరయ్య. ★

# మీరు కేవలం ఓ బల్బ్ కొనాలనుకుంటే, ధారాళంగా దేనినైనా కొనండి
# కాని మీరు చౌకగా కొనాలనుకుంటే,
# హెచ్‌ఎమ్‌టిని కొనండి



చాలా బల్బులు, ఒకే ధరలో ఉంటాయి. అన్నీ ఒకే కాలం మన్నుతాయి. హెచ్‌ఎమ్‌టి బల్బులు కూడా అంతే ధరలో వుంటాయి. కాని చిరకాలం మన్నుతాయి. అందుచేతనే అవి చౌక అయ్యాయి.

హెచ్‌ఎమ్‌టి బల్బులు ఎంచేత చిరకాలం మన్నుతాయి?

ఇతర ఉత్పాదకులున్నా హెచ్‌ఎమ్‌టి కొన్ని ప్రత్యేకమైన లాభాలను కలిగివుంది. హెచ్‌ఎమ్‌టి మాత్రమే తమంతట తామే, బల్బు యొక్క అన్ని భాగాలను తయారు చేసే ఏకైక సంస్థ. అంచేత ప్రతి దశలోనూ నాణ్యతను అదుపులో ఉంచేందుకు హెచ్‌ఎమ్‌టికి వీలౌతుందన్న మాట.

ఇంకా హెచ్‌ఎమ్‌టి వారు బల్బులు తయారుచేయడం ప్రారంభించక ముందే వారు బల్బులను తయారుచేసే యంత్రాలను ఉత్పాదనచేస్తూ వస్తున్నారు. ఇందువలన కేవలం సాధారణ బల్బులు కాక విశిష్టమైన, ఉత్తమమైన బల్బులు తయారుచేసే సాంకేతిక పరిజ్ఞానపు ఆధిక్యతను హెచ్‌ఎమ్‌టి కలిగివుంది.

అంతేకాదు, హెచ్‌ఎమ్‌టి వారు టంగ్‌స్రామ్ వారి— అంటే ప్రపంచంలో ల్యాంప్‌లు తయారుచేయడంలో అత్యంత అనుభవం కలిగిన ఒకానొక విశిష్ట సంస్థ— అనుభవం, విజ్ఞానం కలిగివున్నారు. ఇది హెచ్‌ఎమ్‌టి బల్బులకు అంతర్జాతీయ నాణ్యతనిస్తుంది.

ఇంకా హెచ్‌ఎమ్‌టి వారికి, వారి గడియారాలు, యంత్ర పరికరాలు మరియు ట్రాక్టర్లు తయారుచేయడంలో 25 ఏళ్ళుగా సంపాదించిన ఖ్యాతి వుంది. మరి ఆ ఖ్యాతినంతా వారు, ఓ గాజు ముక్కపై పణంగా ఒడ్డుతున్నారంటే ఏదో వుందన్న మాటే మరి.

[illegible] వుంది మరి. మరింత ప్రకాశవంతమైన కాంతి, చిరకాలపు మన్నిక, ఇంకా ఉత్తమమైన నాణ్యత, ఇంకా చౌకగాను

**hmt**






## హెచ ఎమట బల్బులు-మాజీవితంలో వెలుగులు

Rediffusion/H/750 TLo

# ప్రశ్నావళి

**ప్రసాద్ — నగాల్లారుపేట**

మానవప్రవృత్తి రోజు రోజుకీ సర్దుబాటు సర్దుకు పోవడం జీవితంలో అయిపోతోంది. కారణం?

జీవిత నౌక సాఫీగా సాగాలన్న తాపత్రయంలో మానవుడు ఎన్నింటికని పోరాడుతాడు? ఎన్నింటి కని ఆరాటపడతాడు? అందుకే— అన్నిటికీ సర్దుబాటు! అన్నిటితో సర్దుకు పోవడం.

**కె ఆర్ కె.ఎస్.కె.జె. — కాజారు**

కరుణామయుడు చూశారా? చివరి షాట్లలో మీరు కన్నీరు కార్చి ఉంటారని మేము, ఆమెది రాతి గుండె ఆమె అసలు కన్నీరు రాదు అంటున్నారు స్నేహితులు.

చూశాను. బాగుంది అనడంతోనే మీలాగా సిల్లీగా కూర్చుని కంటికీ, మంటికీ, ఏక ధారగా ఏడ్వాలని అంటే మీరు నవ్వుతారు. సినిమాలు చూసి ఏడ్చే స్టేజి దాటేశాను!

**డి.ఎస్ ఆర్. — మిట పల్లి**

మనిషికి విలువ ఎప్పుడు ఉంటుంది.

ఆత్మ గౌరవం పంపుకుందుకు [-ప్రతి విష్టదానికీ] సిద్ధంగా ఉన్నప్పుడు.

నేటి సమాజంలో పేరికి ఉంది విలువ?

సెక్సుకీ, డబ్బుకీ, అధికారానికీ.

**డి. ఎస్. — షెలంపల్లి**

ఆడదానికి ఒక నీతి, మగవాడికి ఒక నీతి. ఇది మన దేశ సంప్రదాయమా? ఆడజన్మ శాపమా?

మగవారు ఆలోచించి రాసిన నీతి శాస్త్రం.

**ఆర్.ఎల్. — విశాఖపట్నం**

క్షణికమైన సౌఖ్యం కోసం స్వార్థం పెంచుకుంటున్న మానవునికి చివరికి మిగిలింది ఏమిటి?

మానవుడు ఏ సుఖాన్నీ క్షణికం అనుకోడు. శాశ్వతం అనుకుంటాడు!!

**టి ఏ.ఆర్.ఎస్. — గుడివాడ**

మొదట కలం స్నేహితులుగా పరిచయం అయి, తరువాత 'సోదరా' అంటూ సంబోధించి రాస్తే అంతర్యం ఏమిటి?

కలం స్నేహంలో సోదర ప్రేమకు తావు లేదనా మీ ఉద్దేశ్యం? సోదరి అని ప్రారంభించి ప్రియాకి పోయేవారూ ఉంటారు చిత్తగించండి.

**బి.ఎస్.ఎల్. — చిత్తూరు**

ఆదర్శ షోకు ఎక్కువ చేసుకుంటూ టైము వేస్టు చేస్తూ ఉంది.

అలాగా పోనీ ఆదిమానవిలాగాను ఈవ్‌లాగానో ఉండి పొమ్మంటారా? ఇడపదార్థాలే పరిసరాలను పట్టి మారుతున్నట్టు అనిపిస్తుంటే, కాలాన్ని పట్ట మారినట్టు కనిపిస్తున్న ఆడదాన్ని ఎందుకు అడి పోసుకుంటారు?!

**హు సెన్. కావాలి**

ఇలాంటి శీర్షికలలో తమ జీవిత సమస్యలగురించి ప్రశ్నలు పంపేవారు అవివేకులని నా అభిప్రాయం?

మీ అభిప్రాయం చాలా తప్పు హుసేన్‌సాబ్! ఇంకెవరేనా ఇదే సమస్య నెలాగైనా పరిష్కరించారా అన్నది తెలుసుకుందుకు కూడా ఇదొక మార్గం. ప్రశ్నకి నేనేలాంటి జవాబిచ్చానని కాదు. ఎందరెందరా ప్రశ్న చదివారన్నది కూడా— మీరు ఆలోచించాలి. అది కూడా చాలా ముఖ్యం. అందుకేమీలాంటివాళ్ళు చెప్పేదంటు అన్న ప్రశ్నలు కూడా అప్పుడప్పుడు నేను సమాధానాలిస్తూ వుంటాను!

**వి. డి. ఆర్. హైదరాబాద్**

ఏడడుగుల అనుబంధం అంటే

శాశ్వత సంబంధం అని!

**ఎస్. ఎస్. బండారిగూడెం**

నేటి సమాజంలో స్త్రీ, పురుషుల మధ్యస్నేహాన్ని ఏమనుకోవాలి?

నేడే కాదు, ఏ నాడైనా సరే, ఎవరెవరి మధ్య నైనా సరే. స్నేహంగానే చూడాలి. అది రూపాంతరం చెందితే— అప్పుడు అది ప్రేమా కావచ్చు, వైరం కావచ్చు, బంధుత్వంగా మారవచ్చు, ఏమైనా కావచ్చును.

**వి. వి. ఆర్. కటకం**

స్త్రీ పోట్లో సంపెంగి నానదంటారు. మీకూ వర్తిస్తుందా?

ఆ! ఏ నూనె గింజనైనా తోలు దళసరికదా. అంచేత నూనె గింజలు నీళ్ళలో వేసినా త్వరగా నానవే. ఈ మాత్రం తెలియదా?

ప్రేమ పగ వీటికి దగ్గిర సంబంధం వుంది — అంటారు. మీరు?

రెండూ ఒకటే.

**వి.స్. డి. ఆర్. విశాఖపట్నం**

నేటి యువతరం చెడి పోడానికి సినిమాలు ఎంత వరకు కారణం?

10 శాతం కారణం. మిగిలిన బాధ్యత— [1] నిరుపయోగమైన చదువు [2] విలువలు గుర్తించేలా పెంచని, పట్టించుకోని తల్లి తండ్రులు [3] అవకాశానికి వాడుకొనే రాజకీయ వాదులు — పంచుకోవాలి.

**వి. సి. పి. ఆర్. నంగనూరు**

మగవారు ఎన్ని వివాహాలైనా చేసుకునే అవకాశం వుంది. ఆడవారికి ఒక్కటికే పరిమితం. కారణం?

ఆడదానికీ వుంది ఎక్కువ పెళ్లి హక్కు. కాని, పిల్లలు బంగారు సంకెళ్లయి సాధారణంగా తల్లుని ఒంటరి జీవితానికి కట్టిపడేస్తాయి.

**వై. హెచ్. ఎస్. ఆర్. డోర్నకల్**

కె. రా. గారూ, నేనొక యువతిని సద్భావంతో పలకరించినా మాట్లాడదేమి?

మీ సద్భావం మాటలలో ప్రతిబింబించడం లేదో ఏమో! కాస్త ఆలోచించుకోండి.

**కె పి. ఆర్. కర్నూలు**

సంసారాన్ని సముద్రంతో పోలుస్తారెందుకు?

అనంతం కనుక.

**పి. డి వందలూరు**

మల్లె తీగ పందిరి మగువ జీవితం అయితే మరి మగవారి జీవితం?

ఆ తీగెను సవ్యమైన ఆధారం కల్పించే పందిరి అనుకోండి. లేదా నేటి సినిమాల దృష్ట్యా చెప్పుకోవాలంటే పూత కోసం ఆకులు దూసే చేతులు అనుకోండి. ఏదైనా ఒకటే— ఎల్లప్పుడూ, మగువకి యీ రోజు మార్కెట్ వాల్యూ ముఖ్యం. మానం, మర్యాద ఎవరు చూస్తున్నారు?

— కె. రామలక్ష్మి






# శిక్ష

మల్లాది వెంకట కృష్ణమూర్తి

"ఇల్లెలా కనుక్కున్నావ్?" అడిగింది సుమలత గుమ్మం అవతల నిలబడ్డ గిరిధర్‌ని చూడగానే, కొద్దిగా విస్మయంగా.

"నిన్ను చూడాలనుకుంటే ఆ మాత్రం ఇల్లు కనుక్కోలేనా?" నవ్వాడు గిరిధర్.

"ఎప్పుడొచ్చావ్ మద్రాసు?"

"నిన్న.. ఓ ఫ్రెండ్ గదిలో దిగాను."

"రా"

గిరిధర్ ముందు గదిలోకి వచ్చాడు. సుమలత ప్లాస్టిక్ వైర్ అల్లిన ఓ కుర్చీ చూపించి తను ఓ కుర్చీలో కూర్చుంది ఎదురుగా.

"మీ ఆయన లేరా?" అడిగాడు గిరిధర్.

"ఆఫీస్‌కి వెళ్ళారు."

"ఎప్పుడొస్తారు?"

"ఆరు దాటుతుంది."

"పిల్లలు ఇద్దరనుకుంటాను?"

"అవును బాబు, పాప. బయటికి వెళ్ళారు. ఏం పనిమీద వచ్చావ్?"

"ఆఫీస్ పనిమీద."

"అయిందా?"

"నిజానికి నేను వచ్చింది కేవలం ఆఫీస్ పనిమీద కాదు. నిన్ను చూద్దామని మద్రాస్‌కి టూర్ వేయించుకున్నాను."

"చాలా థాంక్స్" మర్యాద కోసం చిన్నగా నవ్వింది సుమలత.

"నన్ను పూర్తిగా మర్చిపోయ్యావ్ కదూ?" అడిగాడు సుమలత మొహం వంక చూస్తూ.

"అవును."

"ఏం?"

"కాలేజీలో చదివే రోజుల్లో నాకు పరిచయం వున్న అందరినీ గుర్తుంచుకుంటూ కూర్చుంటే ఇంట్లో అవసరాలు ఎవరు చూస్తారు?" నవ్వింది.

"ఉత్తమ గృహిణిగా మారావన్నమాట." నవ్వాడు గిరిధర్. ఆ మాటల్లో ధ్వనించిన వెటకారాన్ని గుర్తించింది సుమలత.

లేచి అన్నది. "కాఫీకి నీళ్ళు పడేసి వస్తానుండు."

గుమ్మం దగ్గరకి వెళ్ళి ఆగి వెనక్కి తిరిగి చూసింది. గిరిధర్ ఆ గదివంక పరిశీలనగా చూస్తున్నాడు.

మధ్యగది దాటి వెనకవున్న వంటగదిలోకి వెళింది. గేస్ స్టవ్ అంటించి సీల్‌గిన్నెతో నీళ్ళు పడేసింది. పాల గిన్నె అందుకుని ఫిల్టర్‌కోసం చూస్తుంటే అకస్మాత్తుగా అనిపించింది తనా గదిలో ఒంటరిగా లేదని. తల తిప్పి చూసింది. మధ్యగదికి, వంటగదికి మధ్య వున్న గుమ్మం దగ్గర నిలబడి వున్నాడు గిరిధర్. నవ్వుతూ చూస్తున్నాడు.

"ముందు గదిలో కూర్చో, తలుపు తీసివుంది. మంగం బాకంలో దొంగతనాలు ఎక్కువగా జరుగుతూంటాయి" చెప్పింది.

"తలుపు గడియ పెట్టేవచ్చాను..."

గిరిధర్ రెండడుగులు ముందుకు వేసాడు.

సుమలత గిరిధర్ వంక చూసింది విచిత్రంగా. గిరిధర్ కళ్ళలోని భావం గ్రహించి అన్నది శాంతంగా,

"ముందు గదిలోకి వెళ్ళు. తలుపు తెరచి కుర్చీలో కూర్చో"

"నేను మద్రాస్ కేంప్ వేయించుకుని వచ్చింది నువ్వు వంట గదిలో కాఫీ కలుపుతూంటే, నేను తలుపు తెరచివున్న ముందు గదిలో గోళ్ళని గిల్లుకుంటూ కూర్చోడానికి కాదు సుమలతా."

మరో అడుగు ముందుకు వేసాడు ఇంకో అడుగు వేసి చెయ్యి చాపితే సుమలత భుజాలు అందుతాయి గిరిధర్‌కి.

"ఏమిటిది? వెళ్ళు" అసహనంగా అన్నది సుమలత.

"నీ గురించి అనుకోని రోజు లేనేలేదు తెలుసా? నమ్మవుకాని రోజూ నీ ఫోటో ఒకసారయినా చూడకపోతే నాకు రోజు గడవదు."

"గిరిధర్. ఇది నా ఇల్లు. నేచెప్పినట్లు వినాలి. అసభ్యంగా ప్రవర్తించకు. వెళ్ళు ఇక్కడి నుంచి."

సుమలతని అందుకోడానికి చెయ్యి చాపి మరో అడుగు ముందుకు వేశాడు గిరిధర్.

సుమలత రెండడుగులు వెనక్కి వేసి చెప్పింది.

"మిస్టర్ గిరిధర్! గెట్ ది హెల్ అవుట్ ఆఫ్ దిస్ రూమ్ బిఫోర్ ఐ కాల్ ది నైబర్స్"

సుమలత మొహంలోని మార్పు, కంఠంలోని కరకుతనం గిరిధర్‌ని మరో అడుగు ముందుకు వేయకుండా ఆపాయి.

"ఐ సెడ్ గెటౌట్"

కొద్దిగా తెల్లబోతూ చూస్తున్న గిరిధర్ వంక తీక్షణంగా చూస్తూ చెప్పింది సుమలత.

గిరిధర్ కోపంగా గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళాడు బయటకి సుమలత ఓ నిముషం సేపు ఆగి మధ్యగదిలోకి వెళ్ళింది. కుర్చీలో కూర్చుని సిగరెట్ ్రగుతున్న గిరిధర్ వంక చూసి ముందు గదికీ, మధ్య గదికీ మధ్యగల కర్టెన్‌ని పూర్తిగా అడ్డంగా లాగి మళ్ళీ వంట గదిలోకి వచ్చింది. ఆ దు నిమిషాలలో కాఫీ తయారుచేసి కాఫీ కప్పుతో ముందు గదిలోకి వచ్చి, వాస్ని టీపాయ్‌మీద వుంచింది

"నా మీద ప్రేమ తగ్గిపోయిందన్న మాట" అన్నాడు గిరిధర్

# శిక్ష

సుమలత కోపంగా లోపలికి వెళ్లి తన కాఫీ కప్పుతో తిరిగి వచ్చింది గిరిధర్ ఎదురుగా కూర్చుంది కాఫీ తాగుతూ.

"లతా, నిన్నింకా ప్రేమిస్తున్నాను." చెప్పాడు.

"నీ పెళ్లాన్ని ప్రేమించడం లేదా అయితే?" అడిగింది సూటిగా గిరిధర్ కళ్లలోకి చూస్తూ.

"నువ్వు మీ ఆయన్ని ప్రేమిస్తున్నావన్న మాట అవునా?"

"పూర్తిగా అగను"

"నా మీద ప్రేమ చచ్చిపోయిందా?"

"అవును. కాఫీ పూర్తిగా తాగాక వెళ్లు. మళ్లీ ఎన్నడూ ఈ గుమ్మంలో కాలు పెట్టకు"

సుమలత తనలో పొంగుకు వస్తున్న కోపాన్ని, బాధని అణచుకుంటూ చెప్పింది.

"ఈ కాఫీ పూర్తిగా తాగాక బయటకి వెళ్లను, ఆ మధ్యగదిలోకి వెళతాం మనిద్దరం అదే కదా మన బెడ్‌రూం. మంచాలు మూసాలే గంటన్నర తర్వాత వెళ్తాను. బహుశా ఓ సంవత్సరం తర్వాత మళ్లీ వస్తాను, ఓగంటన్నర సమయం కోసం"

"షటప్" కోపంగా సుమలత లేచి నిల్చుంది ఎర్రబడ్డ మొహంతో.

"వెళ్లు. గెటౌట్" అరిచింది.

గిరిధర్ సగం తాగిన కాఫీ కప్పుని టీపాయ్ మీద వున్న సాసర్‌లో వుంచి సిగరెట్ వెలిగించుకున్నాడు తాపీగా.

"నీ సంసారం నీకు ముఖ్యమా? లేక ఎన్నడో నాకు అర్పించుకుని అప్పుడే ఓ సారి కోల్పోయిన శీలం ముఖ్యమా?"

"అంటే?"

"అంటే. గంటన్నర ఇక్కడ నీతో గడపకుండా బయటికి వెళితే సరాసరి మీ ఆయన దగ్గరికి వెళ్లి నీ గుట్టు రట్టు చేస్తాను. అప్పుడెలగూ ఆ ఇంటికి వెళ్లాల్సి వస్తుంది నువ్వు. గప్‌చిప్‌గా..."

గిరిధర్ వెంప నగిలింది, అతని మాటలు పూర్తి కాకుండానే. సుమలత ఉగ్రదేవతలా అరిచింది.

"దుర్మార్గుడా నా కళ్ల ముందు నుంచి వెళ్లు ముందు... అవుట్ గెటౌట్"

"నువ్వు, నేను ఓ రాత్రంతా గడిపాం మా ఇంట్లో మర్నాడు వుదయం నువ్వు నాకు రాసిన ఉత్తరం నా దగ్గర వుంది. చూపించనా?"

"బ్లాక్ మెయిల్ చేసి నన్ను వంచించడానికి వచ్చావా?" రొప్పుతూ అడిగింది

"నువ్వసలు నే రాగానే ఎంతో సంతోష పడతావనుకున్నాను ఇంతకాలం లేదే అని అడుగుతావనుకున్నాను ఇలా అసహ్యంగా ప్రవర్తిస్తావనుకోలేదు"

"అబద్ధం అనుకొని అందుకే ఆ వుత్తరం కూడా తెచ్చావ్."

"ఆల్‌రైట్ నీ ఇష్టం వచ్చిన విధంగా నువ్వు అనుకోవచ్చు. అది నీ హక్కు. ఈ వుత్తరం నీ భర్తగారికి చూపించనా లేక ఆయనకి తెలిసినా ఫర్వాలేదా లేక ఆయనకి ముందే చెప్పేశావా లేక ఆయన నమ్మరని నీ ధైర్యమా లేక..." చిన్నగా నవ్వి చెప్పాడు... లేక నవ్వుకుంటావా?"

సుమలత కాఫీ కప్పు అందుకొని అందులోని కాఫీని గిరిధర్ మొహం మీదకి బలంగా విసిరి కొట్టింది

"ఇప్పుడు పక్కింటివాళ్లందరినీపిలవనా? పోలీస్ స్టేషన్‌కి పంపించనా నిన్ను?"

గిరిధర్ అవాక్కయి పోయాడు. సుమలత అలా చేస్తుందనుకోలేదు.

"ఇంత పొగరా నీకు? గుర్తుంచుకుంటావ్ ఈరోజు! కలకాలం గుర్తుంచుకుంటావ్. కుమిలి కుమిలి ఏడుస్తావ్" ఆవేశంగా బయటకి వెళ్లిపోయాడు చేతి రుమాలతో మొహం మీద ఒలికిన కాఫీని తుడుచుకుంటూ

సుమలత వెక్కి వెక్కి ఏడుస్తూ కుర్చీలో కూలబడింది నిలబడలేక. ఆపుకుందామనుకున్నా ఆగటంలేదు తెరలు తెరలుగా వస్తున్న ఏడుపు

ఇంకో నాలుగు గంటల్లో వస్తాడు తన భర్త. అడిగితే ఏంచెప్పగలదు తను?

*　　*　　*

"ఆలాగ – మిమ్మల్ని చూసిన గుర్తు లేదు ఎప్పుడూ" అన్నాడు సుమలత భర్త తన ఎదురుగా కుర్చీలో కూర్చున్న గిరిధర్‌ని చూస్తూ

"నేను మీ పెళ్లికి వచ్చాను."

గిరిధర్ మొహం మామూలుగా లేదనిపించింది సుమలత మొగుడికి. ఎందుకో ఆవేశాన్ని, తత్తరపాటుని అణచుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నట్లుగా అనిపించింది ఆయనకి

"చెప్పండి. నాతో ఏదయినా పనివుండి వచ్చారా?"

అవునన్నట్టుగా తల వూపాడు గిరిధర్.

"పర్స్ పోయిందా? డబ్బు కావాలా?" చిరునవ్వుతో అడిగాడు.

"కాదు"

"మరెందుకలా వున్నారు?"

ఓసారి తల వంచుకున్నాడు.

"మీరు నన్ను మనస్ఫూర్తిగా క్షమించాలి." అన్నాడు.

"క్షమించాననుకుందాం. కాని ఎందుకు క్షమించాననుకుందామో తెలుసుకోవచ్చా?" నవ్వాడు.



రెస్టు గావాలన్నావ్! నెల్రోజులు లీవు సాంక్షన్ జేశా!! వెళ్లు హాయిగా!! లీవులో యీ చిన్న పని పూర్తి చేసుకురా!!

"మనస్సాక్షి వుంటుందని నమ్ముతారా మీరు ?" అడిగాడు గిరిధర్.

"నమ్ముతాను."

"అదే మీ దగ్గిరికి లాక్కొచ్చింది నన్ను."

సుమలత భర్త కొద్దిగా సీరియస్‌గా చూసాడు గిరిధర్ వంక.

"స్పష్టంగా సంగతి చెప్పండి. చాలా పని వుంది."

ఓసారి తలఎత్తి సుమలత భర్త వంక చూసి మళ్ళీ తల దించుకున్నాడు.

"నేను, సుమలత ఒకే కాలేజీలో చదువుకున్నాం. మా ఇంట్లోనే అద్దెకుండేవాళ్ళు."

జేబులోంచి సిగరెట్ పాకెట్ తీసి ఒకటి సుమలత భర్తకి ఆఫర్ చేసాడు.

"నో. థాంక్స్. మానేసాను. మీరు స్పష్టంగా, త్వరగా చెప్పండి సంగతి" అన్నాడు సుమలత భర్త.

"సుమలత నేను ప్రేమించుకున్నాం. వివాహం చేసుకోవాలని కూడా అనుకున్నాం. కాని కొన్నిపరిస్థితులవల్ల అదికుదరలేదు." ఆగాడు గిరిధర్. తల ఎత్తి సుమలత భర్త కళ్ళలోకి చూసాడు.

అతనికి ఏ భావం గోచరించ లేదు ఆ కళ్ళలో. తీక్షణంగా చూస్తున్నాయి.

"ఓ రాత్రి అనుకోకుండా మేం ఇద్దరం ...ఆ రాత్రి నన్ను తప్ప ఇంకెవరినీ చేసుకోనని మాట కూడా ఇచ్చింది. ఇది సుమలత రాసిన వుత్తరం. ఇంతకాలం నుంచి మీ ఎదుటబడి ఈ సంగతి చెప్పి, మీరు మన సారా క్షమించావని చెబితే నిశ్చింతగా వెళ్ళచ్చని కలలు గంటున్నాను. ఐ యామ్ వెరిబీ సారీ సర్...తెలియక చేసినా, తెలిసి చేసినా మీకు ద్రోహం చేసాను. అత్యంత విలువయిన..."

"అర్థమైంది" అన్నాడు సుమలత భర్త ఇంక మాట్లాడద్దు అన్నట్లుగా.

గిరిధర్ మాట్లాడటం ఆపేసాడు. సుమలత భర్త టేబిల్‌మీద వున్న వుత్తరం అందుకుని చదివాడు. అది కాలేజీ విద్యార్థులు వుపయోగించే ఓ ఎక్సర్‌సైజ్ పుస్తకంలోంచి చింపిన కాగితంమీద రాయబడివుంది. తన భార్య చేతివ్రాత గుర్తుపట్టాడు.

గిరిధర్,

అబ్బ !

ఇప్పుడే నిద్ర లేచాను. ఒళ్ళంతా నొప్పులుగా వున్నాయి నువ్వే గుర్తొస్తున్నావ్. నా జీవితం నీతోనే ముడిపడి వుంది. ఇంకెవ్వరూ నా మనసులో నీలా స్థానం ఆక్రమించుకో లేదు... తలుచుకుంటేనే సిగ్గేస్తోంది.

నీ

సుమలత.

టేబిల్‌మీది గిరిధర్ సిగరెట్ పేకెట్ అందుకున్నాడు సుమలత భర్త. ఓ సిగరెట్ తీసి వెలిగించాడు. ఆ వుత్తరం వంక చూస్తూ, గుప్పు గుప్పున సిగరెట్ సగం కాలేదాకా ఆలోచిస్తూండి పోయాడు.

"మీకు వివాహం అయిందా?" అడిగాడు నిశ్శబ్దాన్ని చీలుస్తూ.

"అయింది."

"ఇంటికి వెళ్తున్నారా ? సుమలత కనబడిందా ?"

"వెళ్ళలేదు."

"అయితే వెళ్తాను ?" అడిగాడు సుమలత భర్త.

"ప్లీజ్ సుమలతని ఇంక ఈ జన్మలో చూడదలచుకోలేదు. ఆమె హృదయంలో అల్లకల్లోలం ఏర్పరచడం నా కిష్టంలేదు."

"ఇదివరకెప్పుడయినా వచ్చారా మద్రాస్ ?"

"లేదు. ఈ అయిదేళ్ళలో ఇదే మొదటిసారి"

"మీరు చెప్పేదేమన్నా వుందా ఇంకా ?"

"సుమలత మంచిది. ఏ కారణంగా మీరు సుమలతని దూరం చేసుకోకండి"

సుమలత భర్త గిరిధర్ కళ్ళలోకి చూసాడు తీక్షణంగా.

"అలా జరగవచ్చను కున్నారా మీరు ?"

"సాధారణంగా మొగవాళ్ళు ఇలాంటి పరిస్థితుల్లో చేసేది అదొక్కటే."

"అని తెలిసీ ఈ వుత్తరం నా చేతిలో వుంచారంటే, సుమలతకి అలాంటి అన్యాయం జరిగినా పర్వాలేదనుకున్నారా ?"

"అబ్బే, మీరు అలా చెప్పారనుకోలేదు."

"మరెందుకీ వుచిత సలహా ?"

గిరిధర్ తల వంచుకున్నాడు.

"నా వివాహం అయిన మొదటి సంవత్సరం నన్నీ క్షమాపణ అడిగివుంటే తప్పకుండా మీరనుకున్న విధంగా జరిగి వుండేది. కాని అయిదు సంవత్సరాలుగా నేను సుమలతతో బ్రతుకుతున్నాను అయిదు సంవత్సరాల్లో నేను సుమలతని పూర్తిగా అర్థం చేసుకున్నాను ఇప్పుడు విడాకులు అనుకుంటే చాలా సమస్య. పిల్లలు. ఏమవుతారు ? వాళ్ళ భవిష్యత్తు ? అది కాదు అసలు విషయం."

సిగరెట్ నేల మీదకి విసిరి చెప్పాడు సుమలత భర్త.

"శీలంగల భార్య దొరకడం మొగవాడి అదృష్టం. అది వప్పుకుంటాను. కాని మొగవాడి అదృష్టం భార్య శీలవతి అయి వుండటం ఒక్కటే కాదు. భార్యలో ఇంకా చాలా వుండాలి. అవన్నీ నా భార్యలో వున్నాయి. ఉదాహరణకి నాకు జ్వరం వస్తే తల్లడిల్లి పోతుంది. దగ్గరే వుండి మా అమ్మని మరిపించేలా సేవ చేస్తుంది. పిల్లలిద్దరినీ ఎంతో క్రమశిక్షణగా పెంచుతుంది. ఇంటిని అద్దంలా, అందంగా వుంచుతుంది. నాకు కోపం ఎక్కువ అది ఇంకా ఎక్కువ అవకుండా సర్దుకుపోతుంది అన్నిటినీమించి నేనంటే అపరిమితమైన ప్రేమ"

క్రొత్త సిగరెట్ వెలిగించి మళ్ళీ చెప్పసాగాడు సుమలత భర్త.

"ఈ అయిదేళ్ళలో మా ఇద్దరి మధ్యా ఏర్పడ్డ మానసిక బంధం .. ఇమోషనల్ అటాచ్‌మెంట్ మమ్మల్ని చాలా దగ్గరకి చేసింది ఇన్ని మంచి గుణాలు గల భార్య నాకు దొరికింది. ఒక్క "తప్పు" గురించి మరిచిపోతే నాకు బతుకంతా ఆనందమే."

తనలో తను చిన్నగా నవ్వుకుని చెప్పాడు సుమలత భర్త.

"ఎక్కడో విన్నాను. శీలంలేనిఆడవాళ్ళలో రెండు రకాలుట ఒకరు పెళ్ళికి ముందు తిరిగితే, ఇంకొకరు పెళ్ళయ్యాక తిరుగుతారుట. నా అదృష్టవశాత్తు సుమలత



పెళ్ళయ్యాక పరాయి మొగాడి వంక చూసే స్వభావం కలది కాదు. విడాకులు తీసుకుని ఇంకో వివాహం చేసుకున్నా, ఆ వచ్చే భార్యకి శీలం వుండి మిగతా లక్షణాలు లేకపోతే ? అన్నిటినీ మించి సుమలత నన్ను కామించింది కాని ప్రేమించలేదు. అదొక్కటే చాలు నాకు ఈ జీవితం ఆనందంగా గడపడానికి. బాబు పేరు సుమలతే సూచించింది. గిరిధర్ కాదు అది. ఏదో సందర్భంలో గిరిధర్ పేరు గల వ్యక్తి గురించిన ప్రస్తావన వచ్చింది మూడేళ్ళ క్రితం నా స్నేహితుడు పేరు అది. ఎంటో విన్నది ఆ పేరు ఏత్తద్దనీ, తనకా పేరంటే అసహ్యం అని చెప్పింది. చాలా కాలం అందుకు అనేక కారణాలు వూహించాను. అసలు కారణం ఇప్పుడు తెలిసింది"

చాలాసేపు సుమలత భర్త మౌనంగా వుండిపోయాడు ఏదో ఆలోచిస్తూ.

"వే వెళ్తాను" లేచాడు గిరిధర్.

సగౌరవంగా చేతిని చాపి, గిరిధర్‌తో కరచాలనం చేసి అన్నాడు సుమలత భర్త.

"వెళ్ళేలోగా ఓసారి ఇంటికొచ్చి కాఫీ త్రాగండి. మీరసలు ఆ పాపం గురించి చెప్పకుండా వుండాల్సింది పొరపాటు చేసారు మీ జీవితంలో మరోసారి .. ఎనీవే, ఇట్సాల్‌రైట్. గుడ్‌లక్"

గిరిధర్‌కి అంతా కలలో జరిగినట్టుగా వుంది, సుమలత భర్త తను వూహించినట్టుగా ప్రవర్తించక పోవటంతో. ఆఫీస్ గదిలోంచి బయటకి నడిచాడు.

"మీ సిగరెట్ పాకెట్ మరిచారు." గుర్తు చేసాడు సుమలత భర్త.

సిగరెట్ పాకెట్ అందుకుని గిరిధర్ రోడ్డు మీదకి వచ్చాడు.

కొద్దిసేపు సుమలత భర్త తనఎదురుగా టేబిల్‌మీద గిరిధర్ వదిలి వెళిన వుత్తరం వంక చూసాడు.

ఆయన గుండెలో బాకు దిగినంత బాధగా వుంది. పురుష స్పర్శ. తొలి అనుభవం తనతో కాదు తన భార్యకి

తనలోని కోపాన్ని అణచుకోడానికి చాలాసేపు నిశ్శబ్దంగా కూర్చుండి పోయాడు. తర్వాత మనసుని కాసేపు తన ఆలోచనల మీద నుంచి మరలించడానికి టెలిఫోన్ డైరెక్టరీని అందుకుని అందులోని పేర్లని అయిదారు నిముషాల సేపు చూస్తూండి పోయాడు.

గిరిధర్ తప్పు చేసాడు అందుకు శిక్ష అనుభవించక తప్పదు అనుకున్నాడు ఆ పుస్తకం మూసి. చిన్న పాఠం నేర్పాలి.

డ్రాయర్ తెరచి అందులోంచి ఓ ఇరవై అయిదు పైసల పోస్టల్ కవరు తీసాడు. దానిమీద 'మిసెస్ గిరిధర్' అని రాసి కింద అనకాపల్లి అని చెప్పిన అతనింటి చిరునామా రాసాడు.

తర్వాత బెల్ కొట్టాడు. ప్యూన్‌రాగానే, ఆ కవరులో తన భార్య కొన్ని సంవత్సరాల క్రితం గిరిధర్‌కి రాసిన వుత్తరం వుంచి అతికించి, ఆ కవరు ప్యూన్‌కి అందించాడు.

"అర్జెంట్‌గా జి. పి. ఓ. కి వెళ్ళి ఈ కవరు రిజిష్టర్ పోస్టులో పంపిరా. జాగ్రత్త. దారిలో పారేయకూడదు. చాలా ముఖ్యమయిన వుత్తరం వుంది ఇందులో" చెప్పాడు అయిదు రూపాయల నోటు అందించి.

# హైదరాబాదు నోట్‌బుక్

## పట్టాభిరామ్ ఇంద్రజాలం :

ఇంద్రుడు మాయచేయడం, ఇంద్రజిత్తు మాయ చేయడం సాహిత్యంలో విన్నాము. రాముడు మాయచేయడం చదువలేదు, వినలేదు. కాని రాముడు మాయ చేయటం కళ్లారా చూచాము. జూలై 14వ తేదీన త్యాగరాయగానసభలో ఆ రాముడు దశరథ రాముడు కాదు, భవరాజ పట్టాభిరాముడు ఈ మాయకు అధ్యక్షత వహించినవాడు శ్రీ పి వి జానకిరాముడు (చీఫ్ షిటిప్నరు). శ్రీ పట్టాభిరామ్ పేరున్న ఇంద్రజాలికుడు. దాదాపు మూడు గంటల పాటు మాయాలోకంలో విహరింప జేసిన ఈ ఇంద్రజాలంలో పట్టాభిరామ్ దాదాపు 25 అంశాలు ప్రదర్శించారు ఒకమేజాబులో నిరంతరం నీరు పూరేట్టు చేయడం, పత్రికలమార్పిడి, హెచ్చుమంట, కత్తిరలత దస్తీలు, పాలుపోసి కొంతం వుంతెప్పించడం, ఖాళీసంచిలో నిమ్మకాయలు తెప్పించడం, బెలూనులో పావురాయి తెప్పించడం, పంజరంలోని పావురాన్ని మాయంచేయడం, దస్తీని సంచిలో వేసి బ్రాసరీని తెప్పించడం, మూడుంటి కలవరుగున పవనాలు, చీలు తీయడం, గంతలు కట్టుకొని చూచి వ్రాత వ్రాయడం, ప్రశ్నలకు సమాధానం వ్రాయడం, దస్తీతో కర్ర తయారుచేయడం, కుండేళ్లమార్పిడి, పిల్లనుమాయం చేయడం, నిమ్మకాసిలు మార్చడం, మనసులోది వ్రాయడం, గ్లాసును కర్రతో పట్టుకోడం, గొవెటిన్ మనిషిగొంతు నరకడం వంటి పెక్కుమాయలు చేశారు. ఉదయం, కళ్లకు గంతలు కట్టుకొని మోటారుసైకిలుపై చిక్కడపల్లి ప్రదక్షిణం చేశారు. కొన్ని మాయలు చేసినప్పుడు ప్రేక్షకులు ఆశ్చర్యానందాలు పొందితే, మనిషిగొంతు నరికే దృశ్యం చూచి భయభ్రాంతు లయ్యారు. అంత భ్రాంతి అని తెలిసినా. ఈ వినోద ప్రదర్శనానికి అధ్యక్షత వహించిన శ్రీ పి. వి. జానకిరామన్, ముఖ్యాతిథి శ్రీ టి. సుబ్బరామిరెడ్డి, ప్రారంభోత్సవం చేసిన శ్రీ వార్ల తతరవు పట్టాభిరామ్ చాతుర్యాన్ని ప్రశంసించారు. సినిమాలు కాక వినోదాలు చాలవున్నవని, సినిమా వ్యామోహం తగ్గించుకొని తక్కిన వినోదాలవైపు జనం దృష్టి మళ్లించాలని శ్రీ తత రావు అన్నారు. ఆనాడు కృష్ణుడు ద్రౌపదీవస్త్రాపహరణలో చీరలు సరఫరా చేశాడట ఈనాడు పట్టాభిరాముడు చీరలు అవాయాసంగా మానసంరక్షణకు సృష్టించారు — అని శ్రీ సుబ్బరామిరెడ్డి అన్నారు. ఇంద్రఛభ్యాంకి పౌర సంబంధాధికారి శ్రీ కె. వి. భాస్కరరావు ప్రసంగిస్తూ, ఇంద్రజాలం ముందు పరజాలం ఆహ్లాదకరంగా వుండదని అంటూ, శ్రీ పట్టాభిరాం తన విద్యతో పదిమందికి ఆనందం కలిగించాలని డబ్బుతోను, అధికారంతోను, సినిమాలు చూడడంతోను పవిత్ర శయాలు రావని, విజ్ఞాన విద్యను ప్రోత్సహించడం వల్ల గాంధీజీ అన్న ఏడు సూత్రాలతో ప్రజలు జీవితాన్ని తీర్చిదిద్దుకోవాలని అన్నారు. ఇంద్రజాలం ఈ ప్రపంచ మిధ్యత్వం చూపుతూ మానవునికి ఎప్పటికప్పుడు ఆత్మజ్ఞానం కలిగిస్తుందని ఆయన అన్నారు. ఈ సందర్భంలో శ్రీ సుధాకర్ అనుకరణ విద్యను చూపారు. వివిధ తెలుగు హిందీ సినిమా నటుల అనుకరణ, వివిధ శకటాల ధ్వనులు అనుకరించి ఆయన శ్రోతలను ఆనందపరిచారు. ప్రారంభంలో శ్రీమతి సుజాత రావు ప్రార్థన చేశారు. శ్రీ ఎన్. వి. నాగేశ్వరరావు ధన్యవాదాలు సమర్పించారు. ఈ ప్రదర్శనాన్ని అభినయ ఆర్ట్స్ ఏర్పాటు చేసింది. శ్రీ జి. వి. సత్యమూర్తిని, మరికొందరిని సన్మానించారు.

## విశాఖ ఉక్కు కర్మాగారంలో ఉద్యోగాలు :

మన రాష్ట్రంలో భారీ పరిశ్రమలే తక్కువ. ఉన్న వాటిలోను తెలుగువారికి ఉద్యోగావకాశాలు తక్కువని గుర్తిస్తున్నాము, వ్రాస్తున్నాము. కారణం మన రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలలో ఆయా శ్రమలకు కావలసిన శిక్షణ ఉండదు గనుక. విశాఖ ఉక్కుకర్మాగారం సంగతే చూద్దాం. ప్రతిసారి కూడా 'విశాఖ ఉక్కు కర్మాగారంలో స్థానికులకే ఉద్యోగాలు' అని ఉపన్యాసాలు చెప్పడమే తప్ప ఎలా వస్తాయన్న సంగతి ఆలోచించరు. విశాఖ ఉక్కు కర్మాగారం స్థాపనోద్యమం దాదాపు ఒకతరం నుంచి ప్రారంభమయింది కదా, మన రాష్ట్రంలోని ఏ విశ్వవిద్యాలయమైనా ఉక్కు పరిశ్రమకు అవసరమయిన శిక్షణ ప్రారంభించిందా? మరి అలాంటి అర్హతలు లేనప్పుడు సాంకేతికతకు సంబంధించిన ఉద్యోగాలు కోరితే ఎలా వస్తాయి? ఇతర రాష్ట్రం వారు, అర్హతగలవారు తప్పక ఉద్యోగాలు సంపాదిస్తారు. మన రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలు రజతోత్సవాలు, స్వర్ణోత్సవాలు, వజ్రోత్సవాలు చేసుకొన్నాయి. ఇంతవరకు రాష్ట్రావసరాలు గుర్తించలేకపోయాయే! ఈ దృష్టితో కమ్యూనిస్టు పార్టీ రాష్ట్రశాఖ కార్యదర్శి శ్రీ ఎన్. గిరిప్రసాద్ ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డికి వ్రాసిన లేఖ ఎంత ప్రాధాన్యం గలది గాన్నిస్తుంది. ఇంజనీరింగు, టెక్నికల్ జీ, ఐ టి ఐ., పాలిటెక్నిక్ కోర్సులు చదివి నిరుద్యోగులుగా వున్నవారికి విశాఖ ఉక్కు కర్మాగారంలో పైనుంచి కిందివరకు వున్న ఉద్యోగాలన్నీ లభించేట్లు చేయాలని ఆయన ముఖ్యమంత్రిని కోరారు. మన ఇంజనీరింగు కోర్సులు ఉక్కు కర్మాగారానికి కావలసిన నైపుణ్యానికి అనుగుణంగా లేవు గనుక ఎలాగా మన రాష్ట్రం వారికి సాంకేతికమయిన పెద్ద ఉద్యోగాలు రావు. గనుక అలాంటి శిక్షణ ఇంజనీరింగు పట్టభద్రులకు ప్రత్యేకంగా ఇవ్వాలని శ్రీ గిరిప్రసాద్ సూచించారు. మన విశ్వవిద్యాలయాలు ఈ శిక్షణను ఇప్పటికైనా ప్రారంభిస్తే, ఉక్కు కర్మాగారం రెండవదశలో నన్నా మనవారు అందుకోకపోతారా ?

## ఉపశ్రుతి :

బస్సు ఎంతసేపటికీ కదలలేదు. ఏం డ్రైవర్ సాబ్, ఎప్పుడు కదులుతుంది బస్? అని అడిగాడొక ప్రయాణికుడు. డ్రైవరు తాపీగా అన్నాడు : అంతా టైం ప్రకారం కదులుతుంది సార్. సార్థకనామా, అరటి టైం ప్రకారం కదిలిపోలేదే. అన్నాడు. వీడిల్లు బంగారంగాను! ఎంత సులభంగా చెప్పాడంటే వీడు నిత్యసత్యాన్ని! అన్నారు రచయిత్రి శ్రీమతి సర్వలక్ష్మి ఆశ్చర్యంగా. ఇది చదువుతో వచ్చింది కాదమ్మా. జీవితానుభవంతో వచ్చిన మాటమ్మా! అన్నారు ఒక ప్రయాణికుడు.

— తిరుమల రామచంద్ర



ఆకాశం మేఘావృతమయివుంది. రోడ్లన్నీ బురదగా చితచితలాడుతున్నాయి. వుండి వుండి ఒకజల్లు కొట్టిపోతూవుంది. చలి చలిగా వుంది. చీకటిపడింది. వీధుల్లో దీపాలు వెలిగాయి. గాలిస్తంభించి వుంది.

రావ్ కిటికి దగ్గర కూర్చుని పైపు పీలుస్తున్నాడు. అతని చెవుల చుట్టూ మఫ్లరు వుంది; శరీరాన్ని కప్పిన స్వెటరు కూడా చలిని ఆపలేక పోతూవుంది. రాత్రి చిరాగ్గా వుంది. ప్రశాంతమయిన ఆ నిశ్శబ్దం భరించలేనిదిగా అనిపిస్తూవుంది. అస్పష్టత గణనీయంగా అతన్లో సంచలనం కలిగిస్తోంది.

ఫోను మ్రోగింది. మాట్లాడాడు.

'హల్లో!'

అవతలి వైపు నుంచి ఎవరో ఏదో చెప్పారు; క్షణాల్లో ఉద్వేగంగా-ఉషారుగా అయిపోయాడు.

రావ్ మొహం వెలిగింది— గడగడ ఏదో మాట్లాడేడు రావ్— ఫోన్లో. మరునిముషం గబగబ క్రిందికి దిగివచ్చేడు. క్వార్టర్స్— వంటినీ జాగ్రత్తగా చూసుకోమని చెప్పి 'గారేజి' తలుపు తెరిచేడు. కారు బుర్రున కదిలి రోడ్డుమీదకి దూసుకు పోయింది.

పెద్ద జల్లు కొట్టింది. ఎడాపెడా కొన్ని నిముషాన ఆగిపోయింది కాసేపట్లోనే.

రోడ్లన్నీ జలమయమయిపోయేయి. సెలయేరుల్లా పారేయినీళ్ళు. రావ్ భార్య ఉష ఊరికి వెళ్ళి నెలరోజులయింది. ఎప్పుడు తిరిగి వస్తుందో తెలీదు. ఉత్తరాలు రాయడంలో తను లేజీ! పెర్వర్టెడ్. కేర్‌లెస్-అని రావ్ అభిప్రాయం. ఆఫోను — సింగ్ ఇంట్లో పార్టీకి తప్పకుండా రమ్మంటాడు. అదీ— మగా! డాన్సు కూడావట. డాన్సుచేసి చేసి మందు కొట్టి— ఎవరికి ఎవరో. తనకి డాన్సర్‌గా ఆనర్సుల్లో గొప్పపేరు. అందరూ తనతో డాన్సు చేయాలని ముందుకు వస్తారు.

కారు దూసుకు పోతోంది. ఊరి మధ్య సందుల్లో వింత ఇరుకు!

ఉక్క. భరించరానంతటి ఉక్క. రావ్ నుదుటి మీద చెమట్లు పట్టాయి. ఆ చెమట ముత్యాల్ని కర్చీఫ్‌తో అద్దుకున్నాడు. రెస్ట్‌లెస్‌నెస్.

సింగ్ మంచి సోషల్‌మాన్. అతనూ తనలాగే బిజినెస్‌మాన్. సింగ్ భార్య మంచి

పొలుగు వెంకటేశ్వరరావు

# సోషల్ లేడీ,



సోషల్ లేడీ. ఆవిడ బుగ్గలు, పెదాలు పోరూరిస్తాయ్. ఆబాడీది పర్‌ఫెక్ట్ షేప్. అందుకే తనలో ఆ కోరిక. అజ్ఞాతవాసం చేస్తూవున్న ఆకోరిక వయస్సు రెండు సంవత్సరాలు. రాక్షసమయిన ఆకోరిక తనలోనే జ్వలిస్తూ వుండింది. వుంటుంది. ఫెంటాస్టిక్.

అంతచిత్తడి నేలలోనూ జనం గజిబిజిగా తిరుగుతు వున్నారు. క్రాస్‌రోడ్స్ జంక్షన్ దగ్గర ట్రాఫిక్ జామయింది. అరగంట పైగా పట్టింది. ఆడామగా-చిన్నా చితకా, ముసలీముతకా జనాలు వర్షంలో తడుస్తూనే తమ పనులు చక్కబెట్టుకుంటున్నారు.

సింగ్ భార్య సుష్మ సుష్మ ఈ జెన్యూన్ లేడీ. ఇంకా టీన్స్‌లోనె వుంది.

సుష్మ. సుష్మ. అని అని యాంత్రికంగానే అస్పష్టంగా గొణిగాడు, రావ్. ఆ ఆలోచనలు రావ్‌ని కాల్చుకు తింటున్నాయ్. సుష్మ అతనిగుండెల్ని నలిపేస్తోంది. ఏమయినాసరే ఇవేళ సుష్మని అందుకోవాలి-అనుకున్నాడు. ఒక దృఢమయిన నిశ్చయానికి వచ్చాడు. సుష్మ అందాన్ని స్వంతం చేసుకోవాలి ఈ రోజు!

అమ్మయ్య! ఓట్టకేలకు గమ్యస్థానం చేరువయింది. ఉర్వీరోడ్స్.

చాలామంది ఆడామగా చేరినట్టున్నారు. సింగ్ బంగళా వెలుగుల్లో మెరిసిపోతోంది. ఆబంగళా ఎదుట కార్లు, రకరకాలకార్లు. మగాళ్ళు పైప్‌లు పీలుస్తూ పొల్లుకబుర్లు. లేడీస్ ఎవిట్లు సవరించుకుంటూ-అంగాంగ ప్రదర్శనలు చేస్తూ వసపిట్టలలాగా వాగుడు.

రావ్‌ని చూసి సింగ్ భార్య ఎదురుగా వచ్చింది అప్పరటి పెదాల్ని, బుగ్గల్ని కసిగా చూస్తూ పెదాల కొరికి చిరునవ్వుతో సుష్మకి విష్ చేశాడు రావ్. పార్టీ మొదలయింది.

ఫారిన్ డ్రింక్ గ్లాసుల్లోకి ప్రవహిస్తు వుంది. గ్లాసులో నుంచి గొంతుల్లోకి దిగుతోంది మంట. నరాల్ని కాల్చేసే మంట. మత్తు నందించే మంట కాల్చి పారేసే మంట. రికార్డు మొదలయింది. హాలులో సంచలనం. గెస్టులు లేచి జంటలుగా జత కట్టారు ఆ జంటలు డాన్సు ప్రారంభించేయి. స్టెప్స్ లయబద్ధమయిన స్టెప్స్. వూగిపోతూ తూగిపోతూ పాములాగ పడు ముల్లి పెనవేసుకున్న చేతులు.

రావ్ విజృంభించేడు. అలుపు తెలియకుండా డాన్స్ చేశాడు. మిసెస్ మూర్తి, మిసెస్ రాజు, మిసెస్ శాస్త్రి ఎందరో చేతులు మారేరు. అలిసి కూలబడిపోయేరు.

సుష్మ అతని దగ్గరికి వచ్చింది. నవ్వింది. అందంగా మత్తెక్కించేలాగ నవ్వింది. ‘మిస్టర్ రావ్. గుడ్ న్యూస్’ అంది. ఆ మాటల్ని విన్పించుకోకుండా రావ్ ఆమెను అందుకున్నాడు. డాన్స్ ఆరంభించేడు. మ్యూజిక్ ఉచ్ఛస్థాయిలో వుంది.

డాన్స్ ఉధృతంగా సాగింది. అతను ఉద్వేగంతో అడుగులు వేసేడు వూగి పోయేడు. అతని చేతుల్లో సుష్మ. స్వీట్ సుష్మ.

చాలసేపు సాగింది డాన్స్. సుష్మ అలిసి పోయింది. రావ్ అలిసిపోలేదు. ఆమె చెవి దగ్గర నోరు పెట్టి రావ్ గొణిగాడు. ‘సుష్మా డార్లింగ్.’

సుష్మ ఉలిక్కిపడి అతనివంక చూసింది. ‘డార్లింగ్ నాకు నువ్వుకావాలి లెటజ్‌గో.’

సుష్మ కళ్ళు ఆశ్చర్యం నింపుకున్నాయి. ‘నో. ఐ డోంట్ కేర్ ఎనీబడీ. ఆయ్ వాంట్ యూ. కమాన్. సుష్మా. కమాన్. ప్లీజ్.’

ఆ సందట్లో సుష్మని పక్కకి లాక్కుపోయేడు. ఆ చీకట్లోను చి అతన్ని చూసింది సుష్మ; అతని కళ్ళు ఎర్రగా జ్యోతుల్లాగా

## మనవి

మా కార్యాలయానికి వచ్చే కథలు, కార్టూన్లు యిచ్చేవారుకూడా వాటితో పాటు తగినన్ని తపాలా బిళ్ళలంటించిన స్వంత చిరునామాగల కవరు వుంచడం మంచిది. వాటిని తిరిగి చేతికి అందివ్వడం సాధారణంగా జరుగదని మనవి. సం.







# సోషల్ లేడీ!

వున్నాయి. రాక్షసంగా వున్నాయి. మత్తెక్కి వున్నాయి.

'రావ్. యూ ఆర్ ఫూలిష్.' అంది సుష్మ. 'యస్. అయామ్ మాడ్ కమాన్' అన్నాడు రావు 'స్టుపిడ్. నేను మీ మిసెస్ గురించి ఒక వార్త చెప్పదలుచుకుంటున్నాను. కాని మీరు.'...

'నో. నో, నన్ను అర్థంచేసుకో సుష్మా. అయ్ వాంట్యూ. ఐలవ్ యూ'. ఆగలేక పోయాడు

'దెన్, జస్ట్ వన్ మినిట్' అంది సుష్మ పెదిమ కొరుక్కుంటూ ఆలోచనాపడి.

'!! ?'

'డ్రస్ మార్చుకుని వస్తాను' అంది. రావ్ ఆనందంతో వూగిపోయాడు. ఈజిట్ సో సింపిల్.

'ఓ. కే.' నవ్వాడు రావ్. నిముషాలే యుగాలుగా ఆత్రుతగా ఆమెకోసం రావ్ ఎదురుచూసాడు వచ్చింది. చరచర ప్రక్క గదిలోకి - స్వర్గంలోకి అడుగు పెట్టాడు రావ్ ఆమెతో.

పావుగంటయింది. ఉద్వేగం పారిపోయింది. ఉల్లాసం మిగిలింది.

హాల్లో ఇంకా మ్యూజిక్ సాగుతూఉంది. పార్టీ తారస్థాయికి చేరుకుంది. కోలాహలంగా వుంది. ఎవరిగొడవ వారిది. ఎవరూ కండిషన్‌లో లేరు.

సంతృప్తిగా, డ్రస్ చేసుకున్నాడు రావ్.

'మై డియరెస్ట్! థాంక్యూ,నౌ-లెట్స్‌గో' అన్నాడు కృతజ్ఞతా పూర్వకంగా. ఆమె భుజం చుట్టూ చేయి వేసి-తలుపు తీసాడు. ఒక్కసారిగా వెలుగు లోపలికి దూసుకు వచ్చింది.

'ఏమిటో అనుకున్నాను. యువార్ రియల్లీ వండర్‌ఫుల్ మిస్టర్ రావ్' అంది; ఆమె. రావ్ వెనుదిరిగి చూసాడు; ఆగొంతు - పరిచితమయ్యిందిగా అన్పించింది.

–అతని మొహంలో నెత్తురు చుక్క లేదు! తెల్లగా పాలిపోయాడు!

'ఆ సమయాన్ని అనుకోకుండా సాయంత్రం ఫ్లైటుకి దిగితే – ఏరోడ్రోంలో సుష్మ కన్పించి తిన్నగా ఇక్కడికి లాక్కువచ్చింది నన్ను. సో. దటీజ్ వాట్ యువార్!'

## "ఆశలు"

స్పందించే హృదయం
చిరంజీవిగా వుండాలని
చిలిపి బతుకు కోరుతోంది
పరిమళించే సౌందర్యం
కలకాలం నిలవాలని
కమ్మని కలలు కంటోంది.
వికసించే ఆలోచన
జీవన రహదారిలో
విద్యుత్తేజాన్ని కోరుతోంది.
బ్రతుకునడిపే జీవితం
మమతల మానవతా చరిత్రలో
మాణిక్యదీపం కావాలనుకుంటోంది.

— వేమకోటి.

## పార్టీ ఫిరాయింపుదార్ల స్వేచ్ఛ

(5 వ పేజీ తరువాయి)

వోటర్లను వంచించారంటూ కోర్టులో దాఖలు చేయబడ్డ దావా హర్షించ దగ్గది- పార్టీనుంచి వెళ్ళిపోయే వ్యక్తి ఆ పార్టీబలం మీద సంపాదించుకున్న 'సీటు'ను కూడా వదులుకొనే "రాజకీయ నీతి" లాంటిది- అంశలు అదుపులేని యీ పవిత్ర భారత దేశంలో రాదు కనుక- దానికి అవసరమైన మార్గం లేదా చట్టం - ఒకటి అన్వేషించడం రాజకీయ నాయకు లందరి కర్తవ్యమూను. ఐతే సామాన్యుడు ఏదేన్న కోసారి తప్ప వీళ్ళకి కనపడని దశలో సామాన్యుని మాట ఎవరు వింటారు?... బజారునపడితే తప్ప...

— వీరాడి

'అయాంసారీ ఉషా, సారీ. ప్లీజ్' అన్నాడు రావు; తల వంచుకుని.

'షటప్. అండ్ లెట్స్ గెటవుట్.' ఆజ్ఞాపించింది ఉష.

ఆమె వెనుకనే సిల్లీ లాగ నడిచి వెళ్ళేడు రావ్. ఆమె బయట కారు దగ్గరకు నడిచింది. లోపల సింగ్ ఇంట్లో పార్టీ కోలాహలంగా సాగిపోతూనే వుంది.

నల్లగా వున్న ఆకాశం జోరున దిమ్మరించటం మొదలు పెట్టింది.

## అమ్మాయిలు-లెక్కలు

విదేశ విజ్ఞానులు లెక్కలు బాగా చేసే అమ్మాయిలలో ఆడ లక్షణాలు చాల తక్కువ వుండడమే గాక, పురుష లక్షణాలు కూడ వుంటాయని, లెక్కలు ఎంత బాగా చేస్తే ఆ లక్షణాలు అంతగా మారిపోతాయని అంటున్నారట. దీనివల్ల లెక్కలలో మంచి మార్కులు సంపాదించుకున్న ఆడవారిని చూస్తే మగవారు భయపడుతున్నారట.

### ఇంటి దొంగలు!

ఓ పెద్ద స్మగ్లింగ్ గ్యాంగులో ప్రభుత్వ ఉద్యోగుల చేయూతవున్నట్టు నిదర్శనాలు దొరికాయట. ఎయిర్ఇండియాలో పనిచేస్తున్న ఓ 14 మందీ, కస్టమ్స్ శాఖలో 13 మంది, సి. బి. ఐ. పోలీసు సంస్థలో పనిచేస్తున్న ఓ తొమ్మండుగురు సహాయంగా వున్నారట స్మగ్లింగ్‌కు!

### కుటుంబనియంత్రణకు గుజరాత్ ప్రోత్సాహం!

గుజరాత్ రాష్ట్రం తన ప్రజలలో కుటుంబ నియంత్రణ ఆపరేషను చేయించుకున్నవారికి ఇరవై రూపాయల రొఖ్ఖం, 300 రూపాయల విలువ చేసే ఓ గడియారం, 50 రూపాయల బట్టలూ బహూకరిస్తోందట. మధ్యప్రదేశ్ ప్రభుత్వ ఉద్యోగస్తులకు వారి ఇంక్రిమెంట్లు ఒకేసారి ఇచ్చేస్తోందట.

### ఓడల్లో శ్రీగంధం!

శ్రీగంధం కర్రలు సుమారు రెండు మూడు ఓడలకు నింపి మద్రాసు ఓడరేవు నుంచి అవోడలను జపానుకు సాగనంపారట. (ఎవరు!) డిక్లేరేషను ఫారములతో ఆ కర్రలు మద్రాసులోని కేతంలన్ను పడగొట్టిన పాతకర్రలు అని వున్నదట. అన్ని కర్రలు రావాలంటే మద్రాసులోని ఇళ్ళలో ఎన్నిటిని పడగొట్టాలో అసలు. అదిగాక ఇళ్ళు శ్రీగంధంతో కట్టారా! ఈ అసలు సంగతి ఏమిటో తెలియలేదట. ఓడలు మాత్రం సురక్షితంగా బయలు దేరాయట— జపాన్!

### కోళ్ళ గోల!

ఈ రోడ్డులో కోడిపందాలాటలను జూదాలుగా ప్రారంభించి ముమ్మరంగా సాగిస్తున్నందువల్ల పోలీసులు ఓ 24 కోళ్ళను వారి సొంతదార్లను అట పట్టించి వారిని అరెస్టు చేసి మాజిస్ట్రేటు కోర్టు ఆరంభమయ్యేలోగా కోర్టు ఆవరణలో తెలతెలవారే ముందు హాజరుపరుస్తే ఆ కోళ్ళన్నీ ముక్తకంఠంతో కుక్కురోకో అని ఎలుగెత్తి అరవనారంభించాయట. ఈ గోల భరించలేక వాటిని వేలం వేయమని తీర్పు జరిగితే వేలంలో 2400 రూపాయలు వచ్చాయట.

### ఏడుకొండలవాడికి నవరత్న హారం!

ఏడుకొండల వాడికి నవరత్నాలహారం సుమారు ఐదు లక్షల కిమ్మత్తు చేసేది చేయించడానికి సమ్మతికోసం ఆంధ్రా ప్రభుత్వం కేంద్రాన్ని కోరిందట.



### ప్రియుడా? మగడా?

తణుకు తలూకా జుత్తిగ గ్రామంలో ధర్మారెడ్డి అనే ఆయన భార్య పద్మావతి తన భర్త సంసారసుఖానికి పనికిరానందున రామిరెడ్డి అనే అతనితో అక్రమ సంబంధం పెట్టుకుందట. ఈ విషయం తెలిసిన ఆమె భర్త ఆమెను వారించి, పోట్లాడుతూ వుండేవాడట. దానితో ఆమెకు భర్త మీద చిరాకు పుట్టి, తన భర్తను తనపొలం చూచుకోడానికి తీసుకువెళ్ళిందట. అక్కడ తరాజూపుంత వద్ద వారిద్దరూ అర్ధరాత్రి పడుకున్నారట. అంతకుముందు ఏర్పరచుకున్న పథకం ప్రకారం ఆమె ప్రియుడు రామిరెడ్డి - అర్ధరాత్రి అక్కడకు వచ్చాడట. ఇద్దరూ కలసి ధర్మారెడ్డిని చంపి, ఓ పుంతలో పారేసి చెక్కేసారట.

### రతి మన్మధ లేహ్యం!

సేలంలో ఓ కంపెనీలో రతిమన్మధలేహ్యం అని ఓ లేహ్యం తయారుచేసి అమ్మబోయేసరికి ఆ లేహ్యం తయారుకు గానీ, అమ్మకానికి గానీ లైసెన్సు లేదని ప్రభుత్వం ఆ లేహ్యం అమ్మడాన్ని నివారిస్తే, ఆ కంపెనీ సొంతదారు కేసువేసి గెలిచాడట. ఇప్పుడు రతి మన్మధ లేహ్యం జోరుగా అమ్ముతున్నారట. అసలా లేహ్య గుణమూ, ఫలమూ ఏమి!

## ఆకలికి పొట్టలెక్కువ!

బెంగాలీయువకుడు 23 ఏళ్ళ సుకుమార్‌దాసు రోజూ ఎనిమిది కిలోల కూరలు, తింటాడట, పనస ఆకులు కూడ తింటాడట, అతనికి జబ్బుచేస్తే ఆవనూనె రెండుకిలోలు, ఓ రెండుకిలోల మిరప కారం కలిపి సేవిస్తాడట. డాక్టర్లతన్ని పరీక్షించి అతనికి ఆరు పొట్టలున్నట్టు ప్రకటించారట. ఆరు పొట్టలా! ఆరుతలలున్న వారున్నట్టు విన్నాము గానీ, ఆరుపొట్టలున్నట్టు వినలేదే! పణ్ముఖా!

### కాపీ హక్కు!

ఢిల్లీలో ఘాజియాబాదు ఎం. ఎం. హెచ్. కాలేజీకి చెందిన వందమంది విద్యార్థులు కాపీ కొట్టుట మా విద్యార్థులకు జన్మహక్కు. దీన్ని ఆపడానికి ఎవరికీ అధికారం లేదు అని నినాదాలు చేసుకుంటూ పురవీధులలో వూరేగరట.

### అక్రమ రవాణా!

పవిత్రాతిపవిత్రమైన మన భారతదేశంలో సుమారు పది లక్షల మందైనా స్మగ్లింగ్ వ్యాపారాల మీద జీవిస్తున్నవారున్నారట. సుమారు నాలుగుపైగా స్మగ్లింగ్ గ్యాంగులు న్నాయట. అవి చాలా పెద్ద గ్యాంగులట. వీటికి విదేశాలలో నూ, విదేశాల లోనూ కూడ మంచి పలుకుబడి వున్నదట.

### 70వ ఏట ఇరవై మూడో పెళ్ళి!

కాలిఫోర్నియాకు చెందిన ఉల్ఫ్ అనే 70 ఏళ్ళ ఆయన మొన్నీ మధ్య ఓ 20 ఏళ్ళ అమ్మాయిని వివాహం చేసుకుని అభినందించవచ్చినవారితో అనకది 23వ వివాహమనీ, 22 మంది భార్యలవల్లా తనకు 93 మంది పిల్లలు కలిగారనీ ఆయన తెలియజేశారట.



ఇంద్రజాలికుడు ప్రొఫెసర్ బి. వి. పట్టాభిరాం జులై 14 వ తారీఖున అభినయ ఆర్ట్స్-హైదరాబాదు వారికి ఇచ్చిన మ్యాజిక్ షో సందర్భంలో శ్రీ టి. సుబ్బరామిరెడ్డి నుండి మెమెంటో అందుకుంటున్న దృశ్యం.

# వారఫలం ★

17-8-1979 శుక్రవారం మొదలు
23-8-1979 గురువారం వరకు

**మేషం :** ఏ మాత్రం వ్యాపార విస్తరణలో లోపం రాదు. రావలసిన బాకీలు క్రమంగా వసూలు అవుతాయి. అనుకున్న ప్రణాళికలు క్రమబద్ధంగా నెరవేరుతాయి. మిత్ర, బంధు వర్గీయుల రాకపోకలుంటాయి. కళారంగంలో స్వయంగా చేసే మీ పనులు రాణిస్తాయి. స్త్రీలకు: ఉద్యోగాభివృద్ధికి దోహదం చేసే గ్రహచారం ఉన్నది. 18 త. మంచిది.

**వృషభం :** రవి గ్రహానుకూలత ఎంతగానో లాభదాయకం. వ్యాపారం, ఉద్యోగం, వ్యవసాయ రంగాల్లో అభివృద్ధి సూచకవారం. మొదటి 4 దినాలు మీరు సిపాయి చేయజాలని పనులుంటవి. ఆదాయంలో అభివృద్ధి, గౌరవం, విఖ్యాత కని పించే వారం. స్త్రీలకు : కొత్తగా ప్రగతి సాధించే మార్గాలేర్పడగలవు.

**మిధునం :** ఆరోగ్య విషయంలో, విద్యాభివృద్ధిలో, ధన సంపాదనా మార్గాలలో ప్రయాస పడక తేగాని, ప్రయోజనం ఆశించినంత లభించదు. అట్లని ప్రయోజన రహితమైన వార మనుకోరాదు. వారఫలం సామాన్య ఫలప్రదాయకం. స్త్రీలకు : చిత్రలేఖన, కళారంగానుభవ జ్ఞానం ద్రవ్యాదాయానికి దోహదం చేస్తుంది.

**కర్కాటకం :** గౌరవానికి గాని, ఆదాయానికి గాని, మనస్పర్ధలు కానివి లోటురాదు. సంస్కృతులైన మిత్రులు, కులవర్తులైన బంధువుల ఆదరణ, అభిమానాలుంటాయి. మీ ప్రాతిపదికలకు రాకుండ చూచుకోండి. ఒక విషమైన లోటు వేధిస్తూనే ఉంటుంది. తలిదండ్రులు సాధించి లాభదాయకమైన దినాలు 20, 21 తా. లుగా భావించాలి. స్త్రీలకు : ఏ విధంగా చూచినా యోగప్రదమైన వారమే.

**సింహం :** ఆరోగ్యం కాపాడుకోండి. ఐశ్వర్యానికేమి దారంతట అది వనరుగా అనుకూలంగా సంభవం. పెద్దల ఆశీర్వచనం, నిరంతం కృషి మీకు సర్వానుకూలం. ప్రయత్నించి, సాధింప లేని కార్యాలుండవు. ఉన్నత విద్యాభ్యాసం గావించే వారికి సర్వానుకూలమైన వారం. స్త్రీలకు : గృహ కార్యకలాపంతో హడావుడిగా వారం గడుస్తుంది.

**కన్య :** ఇంకా గోచారం, అభీష్టం నెరవేర్చే రీతిగా లేదు. ఏది చెప్పినా జాప్యం జరిగేదినాలు. మంచి జరుగవలెనన్న కాలం కలిసి రావలెగదా! ఆరోగ్య విషయంలో వారారంభంలోనే లోపం గ్రహించగల్గుతారు. 20 త.లు సంప్రశస్తం లవి ముఖ్య కార్యాలోచనలు చేయండి. స్త్రీలకు: ఉద్యోగ వాంఛగల వారికి లాభప్రదాయకమైన వారం.

**తుల :** మంచి పనులను గూర్చి, సంఘ కార్యకలాపాలను గూర్చి, శ్రద్ధాసక్తులు చూపుతారు. అందు మూలాన ఆదాయంలో అభివృద్ధి కల్గుతుంది. రావలసిన బాకీలు వసూలు కావటంలో ఆక్షేపణ లేదు. ఆలోచించి పనులు నెరవేర్చే ప్రకృతి. ఆరోగ్యం బాగుంటుంది. స్త్రీలకు : రాజకీయంగా పలుకుబడిగల వారికి అన్ని విధాలా లాభదాయకం.

**వృశ్చికం:** శారీరకంగా ఏదో లోపం కనిపిస్తుంది. వైద్య సహాయం కూడా అపేక్షించవచ్చు. ఏ మాత్రం అలస్యం చెయుటం తగదని కూడా మొదటి 3 ది.లలోనే గ్రహిస్తారు. ఆదాయం, భివృద్ధి అపేక్షించిన పనులు నెరవేరటం, ఆలస్యం గాకుండ పనులు నెరవేరటానికి ఇంకా కొంతకాలం పడుతుంది. స్త్రీలకు : అన్ని విధాల పరీక్షా సమయం.

**ధనుస్సు :** కేతుగ్రహానుకూలత వల్ల, రావలసిన బాకీలు వసూలు కావటం, రవి వల్ల కావలసిన పనులు నెరవేర్చటం, శుభ కార్యానుకూలతకు, కాలం కలిసిరావటం గమనిస్తారు. చేయదలచిన పనులు, వెంటనే గమనించండి. స్త్రీలకు: ఉన్నతాధికారులకు వాస్తవంగా మంచివారమే. 22 త. సుప్రశస్తం.

**మకరం :** ఆరోగ్య విషయంగా హెచ్చరిక. ఉష్ణ పైత్య ప్రకోపం, చాల మందికి, ముఖ్యంగా వయసు మీరిన వారి విషయంలో కనిపించటం, వైద్య సహాయం అపేక్షించడం, మీరే గమనిస్తారు. గ్రహజపం — దైవచింతన ముఖ్యం. స్త్రీలకు : గృహ విస్తరణ కార్యక్రమం చాల మంది చేపడతారు.

**కుంభం :** పనులు ఆలస్యం కాకుండా, ద్రవ్యాదాయంలో ఆశాభంగం కాకుండ ఉండవలెనంటే ఇంకా కొంత కాలం పట్టవచ్చు మధ్య విడిచిన కొన్ని అరగొర పనులు వారం చివరి రెండుదినాలలో పరి సమాప్తి కావచ్చు. స్త్రీలకు: అన్ని విధాలా బాగుంటుందనే చెప్పవచ్చు.

**మీనం :** ద్రవ్యాదాయానికి అనుకూలమైన వారం. శుభకార్యం ప్రస్తావన ఉంటుంది. బంధువుల రాకపోకలుంటాయి, ఆలోచన ఫలించే మార్గం ఉన్నది. అనుకూలమైన వారం. స్త్రీలకు : ఆర్థికంగా బాగుంటుంది. అన్ని పనులు అనుకున్న విధంగా నెరవేరుతాయి

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి.

### తాజా కాలమ్

వాలాకాలం తర్వాత మా అభిమాన ప్రఖ్యాత వార పత్రిక శ్రీపతి గారి ముఖచిత్రంతో ఈవారం మా (మీ) పత్రిక చూడముచ్చటగా, ఆకర్షణీయంగా వుంది. తాజాకాలమ్‌లో నేటి రాజకీయాల గురించి చాలా బాగా తెలియజేస్తున్నారు. ముఖ్యంగా లోక పోకడ కార్టూన్స్ చాలా బాగుంటున్నాయి. స్కైలాబ్ గురించి మీరు తెలియ చేసిన విశేషాలు చాలా ఇంట్రెస్టింగ్‌గా వున్నాయి.

మండవ శివప్రసాద్, ఎస్. వి.సుబ్బారావు, (హైదరాబాదు).

### స్కైలాబ్

3-8-79వ తేదీ మా అభిమాన ఆంధ్ర పత్రిక వారపత్రికలో ప్రచురించిన కథలన్నీ చాలచాల బాగున్నవి. స్కైలాబ్ ముఖచిత్రం ఇంతవరకు మా అభిమాన వారపత్రికలో ఎందుకు ప్రచురించలేదని అనుకున్నాము. అనుకోకుండ ఈ సంచికలో




చూశాం. స్కైలాబ్ ముఖచిత్రం మరియు దాని గురించి తెలుసుకున్నాం.

వెంకుమహంతి శేఖర్‌పట్నాయక్, వెంకుమహంతి మన్మథపట్నాయక్, కె.జి.సరళకుమారి (బరంపురం)

### కథలు

27.7.79వ తేది ఆంధ్రపత్రిక వారపత్రికలో శ్రీ కొండేపూడి సూర్యకామరాజుగారి ఆవకాయ రోజాలొచ్చాయ్. . . అనిడే గతి కథలో ఎంత ఆవకాయ తయారు చేసే మాత్రం నాలుగువందల రూ.లు ఖరీదు చేసే రెండు జాడీల ఆవకాయ వూరకనే ఇచ్చి వేయడమా ?

శ్రీ మంత్రవాది మహేశ్వర్‌గారి అప్పారావూ‌ఆత్మ హత్య కథలో రచయిత కాబోయే వారి పాట్లు తేటతెల్లమాగుచున్నవి.

మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్‌గారి రాగరేఖలు సీరియల్ చాలా ఆసక్తిదాయకముగా సాగుతోంది.

పిళ్లా మహాలక్ష్మినాయుడు, ఆర్. చిన్నయ్య నాయుడు, (ఏటికొప్పాక)

* * *

అప్పారావూ— ఆత్మ హత్య కథ చాలాచక్కగా ఉంది. వలిని సీరియల్ కొత్త పోకడలతో ఉత్సాహంగా సాగుతోంది. థాంక్స్ టు చిట్టారెడ్డి. కార్టూన్ల విషయములో మరి కొన్ని ఎక్కువ మోతాదులో అందివ్వగలరని ఆశిస్తూ—

బి. సుబ్బరావురాజా, కుమారి సుహాసిని, కమల లక్ష్మికుమారి, మాలిని, మధవి, ( గూడూరు.)


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishn

# ముద్దు బిడ్డ మొదటి ఘన ఆహారం. ఇందులో సులభంగా జీర్ణమయ్యే బియ్యం, పుష్టికరమైన 11 విటమినులు, మరియు యినుము కలసివున్నాయి

# నెస్టమ్

## బిడ్డలకై తయారు చేయబడిన బియ్యపు సారం.




మీ ముద్దు బిడ్డకు ఘన రూపమైన ఆహారం పెట్టడం ప్రారంభించారంటే, ఆ బిడ్డకు మంచి పుష్టినిచ్చే ఆహారం యివ్వండి. అంతేకాదు, ఆ ఆహారం అతి సున్నితమైన ఆ బిడ్డ జీర్ణావయవముల మీద తేలికగా పనిచేసేదిగా కూడా వుండాలి. సులభంగా జీర్ణమయ్యే ధాన్య ఆహారం బియ్యమేనని డాక్టర్లు అంగీకరించారు. అందుచేతనే మేము బియ్యంతో నెస్టమ్ క్రీమ్ తయారు చేశాము. ఇందులో మీ బిడ్డ ఆరోగ్యంగా పెరుగుటకు ముఖ్యంగా అవసరమైన విటమినులు, ఇనుము తగినంత పాళ్లలో చేరియున్నది.

మీ ముద్దు బిడ్డకు 3 నెలలు నిండగానే యీ ఆహారం యివ్వడం ప్రారంభించవచ్చు. బిడ్డ పెరిగే కొద్దీ, యీ ఆహారానికి పండ్లు, కాయగూరలు, పప్పు, కలిపి, క్రొత్త క్రొత్త రుచులు చవి చూపించవచ్చు మెల్ల మెల్లగా.



గరిష్ఠ ధర
రు. 7-00
స్థానిక పన్నులు
అదనం.

**పూర్తి పోషక పదార్థములతో సులభంగా జీర్ణమగు నిండు ఆహారాన్ని తయారు చేయుటకై దీనిని పాలతో కలపండి.**



ముందుగా కాచియుంచిన పాలను వంచుకోండి.



దానికి నెస్టమ్ కలపండి.



వెంటనే యిచ్చుటకు తయారు




SAA/FSL/N/1134

